ఉదయం
304432
విజయవాడ
బుధవారం
22-5-1974
THE ANDHRA PATRIKA
Regd. H / VJ. No. 49
PUBLISHED SIMULTANEOUSLY FROM MADRAS & VIJAYAWADA

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO
సంపుటం : 61
సంచిక : 50
పుటలు : 4
వెల : 18 పైసలు



# ఆరు సూత్రాల పథకం కింద రు. 90 కోట్లు ప్రత్యేక సహాయం

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాదు మే 21 : ఆరుసూత్రాల పథకం ప్రకారం వెనకబడిన ప్రాంతాల అభివృద్ధికి ఐదవ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రప్రదేశ్‌కు రు 90 కోట్లు ఇవ్వాలని కేంద్రం ఒక పథకాన్ని రూపొందిస్తున్నట్లు తెలుస్తున్నది.

ఏటా రు 18 కోట్లు చొప్పున ఐదేళ్ళు ఈ డబ్బు ఇవ్వాలని వారు ఆలోచిస్తున్నారని చెబుతున్నారు. కేంద్ర సహాయం త్వరగా తెలియజేయడం మంచిదని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఈ మధ్యన కేంద్రానికి చెప్పి వచ్చారు.

"ప్రయాణీకులే లేనిరైళ్లు!"
"అసలు ఆ రైళ్లుకి నడిపే సిబ్బంది ఉందా అని!"

## వ్యవసాయ విశ్వ విద్యాలయ సిబ్బంది శ్రీముఖం

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాద్ మే 21 : వ్యవసాయ విశ్వ విద్యాలయం సిబ్బంది కోర్కెలను అధికారులు మే నెలాఖరులోగా అంగీకరించకపోయిన పక్షంలో జూను నెలలో ఉద్యోగులు ప్రత్యక్ష చర్యకు దిగగలరని ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం ఉద్యోగుల సంయుక్త కార్యాచరణ మండలి కన్వీనర్ డాక్టర్ దశరథరావు నేడు ప్రకటించారు.

రాష్ట్రంలో వ్యవసాయ విశ్వవిద్యాలయం మినహా మిగతా అన్ని విశ్వ విద్యాలయాలు, తదితర స్థానిక సంస్థలు, ప్రయివేటు సంస్థలు హెచ్చించబడిన కరువు భత్యాన్ని 1—1—74 నుంచి మంజూరుచేసి వున్నాయని ఆయన అన్నారు. ఈ కారణంగా వ్యవసాయ విశ్వ విద్యాలయంలోని 5000 మంది ఉద్యోగులు నిస్పృహతో వున్నారని ప్రస్తుత ద్రవ్యోల్బణం మూలంగా వారి సహనం నశించిపోతోందని ఆయన చెప్పారు.

## బీహారు రాజకీయాలపై ఢిల్లీలో నాయకుల చర్చలు

న్యూఢిల్లీ, మే 21 : రైల్వే మంత్రి శ్రీ ఎల్. ఎన్. మిశ్రా కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టర్ శంకర్ దయాళ్ శర్మను గత రాత్రి కలుసుకున్నప్పుడు బీహారు రాజకీయాలను గురించి చర్చించినట్లు తెలుస్తున్నది.

బీహారు పి.సి.సి. అధ్యక్షుడు శ్రీ సీతారాం కేసరి కూడా డాక్టర్ శర్మను, దేశీయాంగ మంత్రి శ్రీ ఉమాశంకర్ దీక్షిత్‌ను విడివిడిగా కలుసుకొని సమాలోచనలు జరిపారు.

## ఆసుపత్రిపాలయిన సారా విక్రేత

మంగళగిరి, మే 21: పెదవడ్లపూడిలో పలువురి మృతికి, పలువురి అస్వస్థతకు కారణమయిన కల్తీ సారాను విక్రయించిన వ్యక్తి కూడా ఆసుపత్రిపాలయిన ఉదంతం ఇక్కడకు తెలియవచ్చింది.

18 వ తేదీన తన ఖాతాదారులందరికీ సారా విక్రయించిన తరువాత దుకాణదారుడు కూడా కొంత మద్యాన్ని సేవించాడని, తత్ఫలితంగా అతడు తీవ్ర అస్వస్థతకు గురి అయ్యాడని తెలిసింది. అధికారులు అతడిని కూడా గుంటూరు జనరల్ ఆసుపత్రికి పంపించారు. యిపుడు అక్కడ అతడు కోలుకొంటున్నాడు.

## రాష్ట్ర విద్యుత్ మండలి అధ్యక్షులు

హైదరాబాదు, మే 21: శ్రీ నార్ల తాతారావు విద్యున్మండలి అధ్యక్షులుగా కొద్ది రోజులలో పదవిలో చేరవచ్చని విద్యుత్‌శాఖమంత్రి శ్రీ గెడ్డం రాజారాం చెప్పారు.

## పంజాబ్ లో గోధుమ సేకరణ

న్యూఢిల్లీ, మే 21: పంజాబులో గోధుమల సేకరణ క్రమ క్రమంగా పెరుగుతున్నది. ఈ నెల చివరకు పది లక్షల టన్నులు కావచ్చునని భావిస్తున్నారు. అయితే గత ఏడాది ఇదే కాలంలో జరిగిన సేకరణలో ఇది సగంమాత్రమే అని రాష్ట్ర ఆహార మంత్రి శ్రీ గురుదర్శన సింగ్ గోధుమల నిగులు రాష్ట్రాల మంత్రుల సమావేశంలో చెప్పారు.

భారత్ భూగర్భంలో జరిపిన అణుశక్తి ప్రయోగ పరీక్షను గురించి ఈ నెల 18 న న్యూఢిల్లీలో విలేకరుల సమావేశంలో వివరిస్తున్న డాక్టర్ హెచ్. ఎన్. సేత్నా భారత అణుశక్తి సంఘం అధ్యక్షులు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి.

# భారత్ అణుశక్తి పరీక్ష: వాల్డ్ హీమ్ ఆందోళన

న్యూయార్క్, మే 21: భారతదేశం అణుశక్తి పాటవ పరీక్ష జరపడం పట్ల ఐక్య రాజ్యసమితి ప్రధాన కార్యదర్శి కుర్ట్‌వాల్డ్ హీమ్ తీవ్రాందోళన వ్యక్తం పరచారని సమితి ప్రతినిధి నిన్న ఇక్కడ ఒక ప్రకటనలో పేర్కొన్నారు.

అన్ని రకాల అణ్వాస్త్ర పరీక్షల పట్ల సమితి సర్వప్రతినిధి సభ అనేక తీర్మానాల ద్వారా విచారం వ్యక్తం పరచిందని, సమగ్రమైన అణ్వాస్త్ర పరీక్షల నిషేధ ఒప్పందం కుదుర్చుకొనాలని గట్టిగా కోరిందని ఆయన అన్నారు.

ఈ తీర్మానాలకు అనుగుణంగా సమితి ప్రధాన కార్యదర్శి పెక్కు సందర్భాలలో తన వైఖరి నొక్కి చెప్పారని, అందుచేత ఈ తాజా పరిణామం ఆయనకు తీవ్రాందోళన కలిగించినదని సమితి ప్రతినిధి చెప్పారు.

## అమెరికా వైఖరి

తాము అణ్వాస్త్ర పరీక్ష జరుపుతున్న విషయాన్ని భారత ప్రభుత్వం తమ ప్రభుత్వానికి ముందుగా తెలుపలేదని అమెరికా విదేశాంగశాఖ ప్రతినిధి జాన్‌కింగ్ నిన్న వాషింగ్టన్‌లో చెప్పారు.

అణ్వాస్త్ర వ్యాప్తిని అమెరికా ఎల్లప్పుడూ వ్యతిరేకిస్తున్నదని, దీనివల్ల ప్రపంచంలో సుస్థిరత దెబ్బతింటుందని ఆయన తెలిపారు భారతకు అమెరికా నిరసన తెలిపినదీ లేనిదీ చెప్పడానికి ఆయన నిరాకరించారు.

## నేపాల్ విచారం

ఖట్మండూ, మే 21, భారతదేశం అణ్వాస్త్ర పరీక్ష జరపడం పట్ల నేపాల్ విచారం వ్యక్తం పరచింది.

ప్రపంచ శాంతి ప్రయోజనాల దృష్ట్యా అన్ని రకాల అణ్వాస్త్ర పరీక్షలకు నేపాల్ వ్యతిరేకమని విదేశాంగశాఖ ప్రతినిధి అన్నారు

## కెనడా ప్రకటన

ఒటావా, మే 21: కెనడాతో కుదుర్చుకున్న అణుశక్తి సహాయ ఒప్పందాన్ని భారత్ ఉల్లంఘించలేదని కెనడా విదేశాంగ ప్రతినిధి నిన్న ఇక్కడ చెప్పారు.

కెనడాపై భుట్టో చేసిన విమర్శకు ఈ ప్రతినిధి సమాధానమిస్తూ, ఒకే రీతి షరతులపై భారత్, పాకిస్తాన్‌లతో కెనడా అణుశక్తి సహాయ ఒప్పందాలు కుదుర్చుకున్నదని, ఈ ఒప్పందంలోని అంశాలను భారత్ ఉల్లంఘించలేదని అన్నారు.

# పాకిస్తాన్ భద్రతకు అమెరికా నుంచి గట్టి హామీ పొందడానికి భుట్టో యత్నం

వాషింగ్టన్, మే 21 : భారతదేశం భూగర్భంలో అణుశక్తి పరీక్ష జరిపినందువల్ల తమ దేశ భద్రతకు మరింత హామీ వుండాలని అమెరికాను ఐక్యరాజ్యసమితిని తాము కోరుతున్నామని పాకిస్తాను విదేశాంగమంత్రి అజీజ అహ్మద్ నిన్న ఇక్కడ చెప్పారు.

సెంటో సమావేశంలో పాల్గొనడానికి ఈయన ఇక్కడకు వచ్చారు.

భారత్ నుంచి అణ్వాస్త్రదాడి ప్రమాదం ఏర్పడితే భద్రతా మండలిలోని శాశ్వత సభ్యదేశాల రక్షణను తాము కోరుతున్నామని ఆయన తెలిపారు.

శ్రీ అహ్మద్ ఇంకా ఇలా పేర్కొన్నారు. "పాకిస్తాన్ గగన మండలం రక్షణకు చర్యలు అవసరమని అమెరికాను కోరుతున్నాము. చైనా, భారత్‌ల మధ్య 1962 లో యుద్ధం వచ్చినప్పుడు అమెరికా ఇలాంటి రక్షణ ఏర్పాట్లు చేయగలనని భారత్‌కు తెలిపింది.

భారతదేశం ఇప్పుడు అణ్వాస్త్రరాజ్యమైనందున అణ్వాస్త్ర విస్తరణ నిరోధక ఒప్పందాన్ని బలహీనపరచింది. దక్షిణాఫ్రికా, ఇజ్రేల్‌లుకూడా అణ్వాస్త్ర రాజ్యాలుకావడానికి భారత్ ఈ రకంగా ప్రోత్సహిస్తున్నది. పైగా ఆసియా దక్షిణభాగంలోని దేశాలతో సంబంధాలు మెరుగుపడటం జాప్యం అవుతుంది.

అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించగలనని భారత్ చేసిన ప్రకటనను మేము నమ్మడంలేదు.

భారత్‌తో మేము చర్చలు జరుపవలసి వున్నది. తంతి, తపాల, వాణిజ్యం, ప్రయాణ సౌకర్యాలు గురించి జరుగనున్న ఈ చర్చలు ఎంతవరకు ఫలిస్తాయో నేను చెప్పలేను. భారత్‌పట్ల మాకు విశ్వాసం పోయింది. తాను శాంతి కోరుతున్నానని భారత్ చెబుతున్నది. ఈ మాటను మేము నమ్మడంలేదు. మేము మాత్రము భారత్‌తో మైత్రి సంబంధాలనే కోరుతున్నాము.

## భారత్, పాక్ చర్చలు వాయిదాపడే సూచన

ఇస్లామాబాద్, మే 21 : ఈనెలలో ఇక్కడ భారత్, పాక్ ప్రతినిధులమధ్య జరుగవలసిన చర్చలు వాయిదా పడవచ్చునని, బహుశా జూన్‌లో జరుగవచ్చునని పాక్ అధికారవర్గాలవారు నేడు తెలియజేశారు.

## భుట్టో ఢాకా ప్రయాణం

భుట్టో ఢాకా ప్రయాణం కూడా జూన్ జులై నెలలో జరుగకపోవచ్చునని ప్రభుత్వ వర్గాలవారు చెప్పారు.

ప్రయాణం తేదీలు ఇంకా నిర్ణయం కాలేదని ఈ విషయమై బంగ్లాదేశ్‌తో సంప్రతింపులు జరుగుతున్నవని వారు తెలియజేశారు.

## గుజరాత్ గవర్నర్ వ్యాఖ్య

సూరత్, మే 21: భారత్ జరిపిన అణుశక్తి పరీక్షను గురించి గుజరాత్ గవర్నర్ శ్రీ కె. కె. విశ్వనాథన్‌కు ఇంతవరకు తెలియదు.

గత మూడు రోజులుగా తాను బల్సార్ జిల్లా లోతట్టు ప్రాంతంలో పర్యటిస్తున్నానని ఏ వార్తాపత్రిక తనకు అందలేదని ఆయన అన్నారు. ఈ ప్రయోగం పూర్తిగా శాంతియుత ప్రయోజనాలకు ఉద్దేశించినది కాగలదన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేశారు.

## భుట్టో ప్రకటన: భారత్ పరిశీలన

న్యూఢిల్లీ, మే 21 : భారత్ అణుశక్తి పరీక్షపై పాక్ ప్రధాని భుట్టో ఈ నెల 19వ తేదీన చేసిన ప్రకటన గురించి భారత విదేశాంగ మంత్రిత్వశాఖ అధికారులు పరిశీలిస్తున్నారు.

భుట్టో ప్రకటనపై ఢిల్లీలో అధికార వర్గాలవారు ఇంత వరకు ఎలాంటి వ్యాఖ్యానం చేయలేదు.

భుట్టో ప్రకటన వల్ల భారత్, పాక్ ప్రతినిధులు త్వరలో జరుపనున్న సమావేశానికి అవరోధం ఉండక పోవచ్చునని ఇక్కడి దవుత్య వర్గాలవారు భావిస్తున్నారు.

## ముస్లిం లీగ్ అధ్యక్షుని హర్షం

కొచ్చిన్, మే 21 : భారత్ జరిపిన అణుశక్తి ప్రయోగం అద్భుత విజయమని భారత ముస్లింలీగ్ అధ్యక్షుడు శ్రీ ఇబ్రహీం సులేమాన్ సయిట్ ఎం. పి హర్షం తెలిపారు.

"ఇది మనదేశపు ప్రతిష్ఠను ఇనుమడింపచేసింది. ముఖ్యంగా ఇది పూర్తిగా మా మేధావంతులు భారతీయులు సాధించిన విజయం" అని ఆయన తన ప్రకటనలో పేర్కొన్నారు.

విజయవంతంగా ఈ ప్రయోగం నిర్వహించిన అణుశక్తి సంఘం అధ్యక్షుడు డాక్టర్ సేత్నాను, సహచర శాస్త్రజ్ఞులను ఆయన అభినందించారు.

బొంబాయి, మే 21 : భారత్ జరిపిన మొదటి అణుశక్తి ప్రయోగం విజయవంతం కావడంపట్ల భాభా అణుశక్తి పరిశోధన కేంద్రం శాస్త్రజ్ఞులు హర్షం తెలిపారు.

# సాగర్, కె. సి. కాల్వల ఆయకట్టుల పునఃస్థిరీకరణ పరిశీలనకు త్వరలో సంఘం

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాదు, మే 21 : ఎ. పి. సి. సి. ప్రధాన కార్యదర్శి శ్రీ ప్రగడకోటయ్య నిన్న ఇక్కడ విలేఖరులతో మాట్లాడుతూ ఆయకట్టుదారులు ఎదుర్కొంటున్న ఇబ్బందుల దృష్ట్యా లభ్యమయ్యే నీటి పరిమాణానికి లోబడి, నాగార్జునసాగర్ క్రింద, కె. సి. కాల్వ క్రింద ఆయకట్టును తిరిగి స్థిరీకరించడానికి గల అవకాశాలను పరిశీలించడానికి త్వరలోనే ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించనున్నట్లు ముఖ్యమంత్రి తనకు తెలియజేశారన్నారు. ఆయకట్టుదారుల సమస్యం గురించి శ్రీ కోటయ్య ముఖ్యమంత్రిని కలుసుకొని మాట్లాడారు.

ప్రస్తుత ఆయకట్టు స్థిరీకరణలో గల లోపాలను నివారించడానికి ఉన్నతాధికార సంఘాన్ని నియమించాలని ఇటీవల నరసరావుపేటలో జరిగిన సాగర్ ఆయకట్టుదారుల మహాసభ కోరివున్న సంగతి పాఠకులకు విదితమే.

వరంగల్, గుంటూరు ప్రాంతాలలో విద్యావసరాలను తీర్చడానికి వరంగల్‌లోను గుంటూరులోను విశ్వవిద్యాలయాలను నెలకొల్పడంపట్ల ముఖ్యమంత్రి తన ఆతృతను వెలిబుచ్చారని శ్రీ కోటయ్య అన్నారు.

తిమ్మసముద్రానికి చెందిన గోరంట్ల వెంకన్న ట్రస్టువారు తమ అధీనంలో ఉన్న 200 ఎకరాల మాగాణి భూమిని, నిధులను, అప్పగించినట్లయితే గుంటూరులో విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పే సంగతి గురించి ప్రభుత్వం తప్పకుండా పరిశీలిస్తుందని, ట్రస్టు కోరిన విధంగా సంస్కృత పీఠం కూడా నెలకొల్పడం జరుగుతుందని ముఖ్యమంత్రి పేర్కొన్నట్లు శ్రీ కోటయ్య వివరించారు.

పొన్నూరులో కొత్త ప్రయివేట్ కళాశాల ఏర్పాటుకు అనుమతించడానికి ప్రభుత్వానికి ఎలాంటి అభ్యంతరం ఉండబోదని కూడా ముఖ్యమంత్రి చెప్పారని ఆయన అన్నారు.

# భారత్ రష్యా వాణిజ్యంలో 30 శాతం పెరుగుదల

మాస్కో, మే 21: 1974 సంవత్సరములో భారత్— సోవియట్ వాణిజ్యం గత ఏడాదికంటే 30శాతం అధికంగా వుంటుంది.

గత ఏడాది ఉభయ దేశాల మధ్య వాణిజ్యం 500 కోట్ల రూపాయలు కాగా ఈ ఏడాది 650 కోట్ల రూపాయలకు పెరగగలదని భావించబడుతున్నది.

భారత వాణిజ్య మంత్రిత్వ శాఖ సంయుక్త కార్యదర్శి శ్రీ ఎ. ఎస్. గిల్ నాయకత్వాన గల భారతీయ అధికార వాణిజ్య ప్రతినిధి వర్గం ఈ వారంలో ఇక్కడ సోవియట్ అధికారులతో ఈ ఏడాది వాణిజ్య ప్రణాళిక అంచనాలను గురించి మదింపు జరిపింది.

ఒక్క న్యూస్‌ప్రింట్ తప్పించి మిగతా వస్తువుల సరఫరాపై చాలా వరకు ఉభయ పక్షాల మధ్య కాంట్రాక్టు పూర్తి అయింది. 45 వేల టన్నుల న్యూస్‌ప్రింట్ సరఫరా విషయమై ఇంకా కంట్రాక్టు కుదరలేదు.

## రాష్ట్రంలో విద్యుత్ ప్రాజెక్టులతీరు: మంత్రి రాజారావ్ వివరణ

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాదు మే 21 : శ్రీశైలం ప్రాజెక్టుపని రేట్ల తగాదావల్ల కొద్దిరోజులు మందంగా నడిచినా ఇప్పుడది సర్దుబాటై యథాప్రకారం నడిచిపోతోందని విద్యుత్‌శాఖ మంత్రి శ్రీ టి. రాజారావ్ ఇవ్వాళ హిమాయత్ నగర్‌లోని తమ బసలో పత్రికా ప్రతినిధులకు చెప్పారు.

ఎగువ సీలేరు ప్రాజెక్టులో రు9కోట్లతో మరి రెండు ఉత్పత్తి యంత్రాలు నెలకొల్పడానికి భారీ విద్యుత్ యంత్ర ఉత్పత్తి కర్మాగారానికి రు 85 లక్షలు ముందు చెల్లించడానికి ప్రభుత్వం సిద్ధపడినదని కూడా మంత్రి చెప్పారు.

నాగార్జునసాగర్‌వద్ద విద్యుత్ ఉత్పత్తి 160 మెగావాట్లవరకు చెయ్యడానికి యంత్రాలు నెలకొల్పే సందర్భంలో మొత్తం రు. 14 కోట్లు ఖర్చుఅయ్యే ప్రాజెక్టు నిర్మాణంలో ఈ ఏడాది రు. 50 లక్షలు మంజూరైనవన్నారు.

కొత్తగూడెంలో విద్యుదుత్పత్తి రెండవ దశలో110 మెగావాట్ల యంత్రం పని చేయనారంభించినదనీ అది కొంచెం శక్తి పుంజుకొన్నాకఅధికారికంగా ప్రారంభోత్సంజరుగుతుందని మంత్రి చెప్పారు. వచ్చే ఆగస్టుకు కొత్తగూడెంలోనే మరో యంత్రం కూడా పని చేయగలదన్నారు.

## రాష్ట్రంలో 939 మంది అరెస్టు

హైదరాబాద్, మే 21 : దక్షిణ మధ్య రైల్వేలో ప్యాసింజరు, గూడ్సురైళ్ల రాకపోకలు సమ్మె పూర్వపు పరిస్థితికి దాదాపు చేరుకున్నవని ప్రభుత్వ ప్రతినిధి ఒకరు నేడిక్కడ పత్రికల వారితో చెప్పారు.

రాష్ట్రంలో ఇంతవరకు 939 మందిని అరెస్టు చేశారు.

## స్థానిక సంస్థల నియోజక వర్గాలకు పెక్కుమంది పోటీ

ఆంధ్రపత్రిక ప్రతినిధి

హైదరాబాద్, మే 21 : వరంగల్ జిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గం నుంచి శాసనమండలికి పోటీ చేయుడానికి అయిదుగురు అభ్యర్థి పత్రాలు దాఖలు చేశారు. కరీంనగర్‌జిల్లానుండి ముగ్గురుదాఖలుచేశారు.

వరంగల్‌జిల్లా : శ్రీ యడవల్లి వెంకటరెడ్డి కాం., శ్రీ వై. నరసింహారెడ్డి, శ్రీ హరికిషన్, శ్రీ పి. దామోదరరెడ్డి, శ్రీ ఎస్. నాగేశ్వరరావు.

కరీంనగర్‌జిల్లా : శ్రీ ఇ. గోపాలరావు కాం. శ్రీ బి. యాదగిరిరావు, శ్రీ బి. కిషన్‌రెడ్డి.

నల్గొండజిల్లా : శ్రీ గూండ రామిరెడ్డి, శ్రీ వి. పురుషోత్తమరెడ్డి, శ్రీ సి. ఎస్. సత్యనారాయణ వు.

ఆదిలాబాద్‌జిల్లా : శ్రీ ముక్సల్‌షా.

నిజామాబాద్‌జిల్లా : శ్రీయుతులు అమృతరావు, ఎల్లా రాజరెడ్డి, కాటిపల్లి పెదరాజరెడ్డి, గల్లప్పపటేల్, చిన్న గంగారెడ్డి, దొండెరావు, ఎ.వి. నారాయణరెడ్డి, ప్రభాకర్, రఘుపతిరెడ్డి, ఎస్. రామచంద్రారెడ్డి, రాజవెంకటరెడ్డి, రామారావు, వెంకటగోపాలరావు, లింబారెడ్డి (కాం.) సుభాష్‌చంద్రరెడ్డి.

## ఉష్ణోగ్రత

విజయవాడ మే 21 : విజయవాడలో నేటి అత్యధిక ఉష్ణోగ్రత 101.8 డిగ్రీలు, (ఫారన్‌హీట్),

# కొత్తగూడెం,విశాఖలలో ఎరువులఫ్యాక్టరీలు: కేంద్రానికి రాష్ట్ర ప్రభుత్వ విజ్ఞప్తి

ఆంధ్రపత్రిక ప్రతినిధి

న్యూఢిల్లీ, మే 21 : ఐదవ ప్రణాళికాకాలంలో ప్రభుత్వ రంగంలో కొత్తగూడెం వద్ద బొగ్గు ప్రాతిపదికగా పనిచేసే రసాయనిక ఎరువుల కర్మాగారాన్ని, విశాఖపట్టణం వద్ద ఫాస్ఫాటిక్ ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్పవలసిందని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని అర్థించింది.

ఎరువుల ఉత్పత్తికి అదనంగా ఇవ్వబడిన టైమెన్సులను పరిగణనలోకి తీసుకున్నప్పటికీ దేశంలో మరే రాష్ట్రానికి లేనంత ఎరువుల కొరత ఆంధ్రప్రదేశ్‌కు కలదని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి సమర్పించిన ఒక వినతి పత్రంలో పేర్కొన్నది. రాష్ట్రానికి ప్రస్తుతం మూడు లక్షల టన్నుల నత్రజని ఎరువులు, లక్ష టన్నుల ఫాస్పేట్ ఎరువులు అవసరం కాగా, 65 వేల టన్నుల నత్రజని ఎరువులు 75 వేల టన్నుల ఫాస్పేట్ ఎరువులు మాత్రమే ఉత్పత్తి అవుతున్నాయి. ఐదవ ప్రణాళికాంతానికి 4.75 లక్షల టన్నుల నత్రజని ఎరువులు 2.21 లక్షల టన్నుల ఫాస్పేట్ ఎరువులు కావలసివస్తాయని ఇందుకుగాను 3.39 లక్షల టన్నుల నత్రజని ఎరువులు 1.08 లక్షల టన్నుల ఫాస్పేట్ ఎరువులు ఉత్పత్తి కాగలవని అంచనా.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా వ్యవసాయంమీద ఆధారపడివున్నది. రాష్ట్రంలో సమర్థులైన రైతులు ఉన్నారు. ఎరువుల కొరత అభివృద్ధి సాధనకు తీవ్రమైన అవరోధంగాఉన్నది. అందువల్ల ప్రస్తుత అవసరాలకు సమీప భవిష్యత్తులో ఏర్పడే అవసరాలకు తగ్గట్టుగా కొత్తగా రసాయనిక ఎరువుల కర్మాగారాలను ఏర్పాటు చేయవలసిన ఆవశ్యకత ఎంతైనాఉన్నది. రాష్ట్రంలో రసాయనిక ఎరువులకు మంచి మార్కెట్ ఉండటమేకాక, బొగ్గు పుష్కలంగా లభ్యమయ్యే సదుపాయాలు ఉన్నాయి. ప్రభుత్వ రంగంలోని సింగరేణి బొగ్గుగనుల కంపెనీ బొగ్గుగనుల త్రవ్వకాన్ని నిర్వహిస్తున్నది.

భారత రసాయనిక ఎరువులసంస్థ రాష్ట్ర ప్రభుత్వాన్ని సంప్రదించి, కొత్తగూడెంలో రసాయనిక ఎరువుల కర్మాగారాన్ని ఏర్పాటు చేసే విషయమై సాధ్యాసాధ్యాలను పరిశీలిస్తున్నది. రాష్ట్రప్రభుత్వం గత సంవత్సరం అక్టోబరు మాసంలోనే ఆ సంస్థకు కావలసిన సమాచారం అందజేసింది. కర్మాగారం పని చేసే పంతకాలం సింగరేణిబొగ్గుగనుల కంపెనీ దానికి తగినంత బొగ్గు లభింప చేయగలుగుతుంది. వెనుకబడి వున్న తెలంగాణాలో ఖమ్మం జిల్లాను కేంద్రప్రభుత్వము, ప్రణాళికా సంఘము వెనుకబడిన జిల్లాగా గుర్తించి ఉండటమేకాక, అది నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతానికి దగ్గరనా ఉన్నది. వాస్తవానికి ఈ జిల్లాలో కొంతభాగం నాగార్జునసాగర్ క్రింద సాగు అవుతున్నది కూడాను. ఈ అన్ని విషయాల దృష్ట్యా కేంద్రప్రభుత్వం వెంటనే కొత్తగూడెంలో ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్పాలి.

ఐదవ ప్రణాళికాకాలంలో ప్రభుత్వ రంగంలో కొత్తగా ఎరువుల కర్మాగారాలు నెలకొల్పేందుకు ఎన్నికచేయబడిన ఐదు చోట్లకాక, మరి కొన్ని చోట్ల కూడా పాస్ఫాటిక్ ఎరువుల ఉత్పత్తి సదుపాయాలను వృద్ధిపరచే విషయం కేంద్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నందున అలాంటి కర్మాగారం ఏర్పాటుకు విశాఖపట్టణం ఎంతైనా అనుకూలంగా ఉంటుంది. ఔటర్ హార్బర్ విస్తరణ వల్లను, రైలు, రోడ్డు సదుపాయాలు ఉండటం వల్లను విశాఖపట్టణం కర్మాగారం గోదావరి, కృష్ణా జిల్లాల అవసరాలనేకాక, విశాఖ జిల్లాలోనూ, ప్రక్కన శ్రీకాకుళం జిల్లాలోనూ ఉన్న వెనుకబడిన ప్రాంతాల అవసరాలను కూడా తీర్చగలుగుతుంది.

## కొచ్చిన్ నూనెశుద్ధి కర్మాగారంపై రైల్వే సమ్మె ప్రభావం

కొచ్చిన్, మే 21 : నూనెనిల్వచేయడానికి తగిన ఖాళీ లేనందున కొచ్చిను నూనెశుద్ధికర్మాగారంలో శనివారం రాత్రి నుంచి పని నిలుపుదల చేయబడింది. దీని ప్రతినిధి ఒకరు మాట్లాడుతూ రైల్వేవ్యాగనుల రవాణా తగ్గినందున తమ టాంకులన్నీ నూనెతో నిండి వున్నాయన్నారు. అయినప్పటికి కొచ్చిను రేవులోవున్న టాంకర్ల నుంచి ముడిచమురును తాము తీసుకుంటూ వున్నామని కూడాఆయన వివరించారు.

## దక్షిణ రైల్వే ప్రకటన

మద్రాసు, మే 21 : దక్షిణరైల్వేవారు కొచ్చిను నూనెశుద్ధికర్మాగారం నుంచి పెట్రోలియం ఉత్పత్తులరవాణాకు అధిక ప్రాధాన్యతను ఇస్తున్నట్లు రైల్వేఅధికారులు ఇక్కడ ప్రకటించారు.

అసాధారణ పరిస్థితులలో కూడా బ్రాడ్‌గేజిపై సగటున రోజూ 100 వ్యాగనులు రవాణా కావలసివుండగా 109 టాంకు వ్యాగనులను రవాణాచేసినట్లు ఉదాహరించారు.

## నేటి నుంచి సర్కార్ ఎక్స్‌ప్రెస్

విజయవాడ, మే 21: సర్కార్ ఎక్స్‌ప్రెస్ రాకపోకలు రేపటినుంచి ప్రారంభమవుతాయని తెలుస్తున్నది. దక్షిణ మధ్య రైల్వేలోని విజయవాడ డివిజనులో 87.6 శాతం సిబ్బంది హాజరవుతున్నారు. రాజమండ్రి నుండి ఒక మామిడి పండ్ల స్పెషల్ బయలుదేరనున్నది. మరి పదిమంది పనివారిని బర్తరఫ్ చేశారు. డివిజనులో మొత్తం బర్తరఫ్ అయిన పనివారు 57 మంది.

## దక్షిణమధ్య రైల్వేలో మామూలు పరిస్థితి

హైదరాబాద్, మే 21: దక్షిణ మధ్య రైల్వేలో ప్రయాణీకుల రైలుబండ్ల రాకపోకలు, గూడ్సు రైలుబండ్ల రాకపోకలు సమ్మెకు ముందు స్థాయికి వచ్చాయని ప్రభుత్వ ప్రతినిధి పేర్కొన్నారు. 1477 మామిడికాయల వ్యాగనులు ఉత్తర రాష్ట్రాలకు రవాణా చేశారు. సమ్మె ప్రారంభమయిన తరువాత అరెస్టు అయినవారి మొత్తము సంఖ్య 939.

# రైల్వే సిబ్బంది నాయకుల సమావేశం: వీలు కల్పించాలని డాంగే విజ్ఞప్తి

న్యూఢిల్లీ, మే 21 : రైల్వే సిబ్బంది జాతీయ సమన్వయ సంఘం సభ్యులుజైలులో గాని, వెలుపలగాని సమావేశం కావడానికి ప్రభుత్వం అనుమతించాలని ఎ. ఐ. టి. యు. సి. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. ఎ. డాంగే నేడొక ప్రకటనలో ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

1. రైల్వే సమ్మె విరమణ, 2. జైలులో పెట్టిన లేదా బర్తరఫ్ చేయబడిన ఉద్యోగుల విడుదల, తిరిగి ఉద్యోగాలలో నియామకం, 3. సంప్రతింపుల పునరుద్ధరణ అనే మూడు ప్రధాన సమస్యలపై చర్చించి ఒక నిర్ణయాలకు రావడానికి సమన్వయ సంఘం సభ్యుల సమావేశం అవసరమని ఆయన అన్నారు.

ఇలా కాకుండా పరిష్కారంకోసం ఏ పథకాన్ని రూపొందించినా అది విఫలమవుతుందని డాంగే పేర్కొన్నారు.

సమ్మె ప్రారంభమైనేటికి 14 రోజులైంది.

ప్రతిష్టంభన తొలగింపునకు కొన్ని సూచనలుచేస్తూ తాను నేడు ప్రధానికి ఒక లేఖ వ్రాశానని డాంగే చెప్పారు.

సోషలిస్టు నాయకుడు శ్రీ మధులిమాయే నేడు ఆర్థిక మంత్రి శ్రీ వై. బి. చవాన్‌ను కలుసుకుని చర్చలు జరిపారు.

# 2 వేల మంది విద్యుత్ ఇంజనీర్ల ఆందోళన

రాజమండ్రి, మే 21 : ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తిసంస్థలోని 2వేల మందిఇంజనీర్లు నిబంధనల ప్రకారం పని ఆందోళన ప్రారంభించి నేటికి మూడవరోజు అయింది.

ఆంధ్రప్రదేశ్ విద్యుత్ ఇంజనీర్ల సంఘం నిర్వాహక కార్యదర్శి శ్రీ వి. రామకోటేశ్వరరావు నేడిక్కడ విలేఖరులతో మాట్లాడుతూ ఈ ఏడాది జనవరిలో రాష్ట్ర విద్యుచ్ఛక్తిశాఖ మంత్రితోను, విద్యుచ్ఛక్తి సంస్థ అధికారులతోను సుదీర్ఘమయిన చర్చలు జరిపినప్పుడు అనుకూలమయిన నిర్ణయం తీసుకోగలమని వాగ్దానాలు వచ్చాయన్నారు. ఈ విషయాన్ని ముఖ్య మంత్రి దృష్టికి పలుసార్లు తెచ్చామని, అయితే దురదృష్టవశాత్తు అధికారులనుంచి ఎలాంటి సమాధానం రాలేదని, వాగ్దానాలు కూడా నిలబెట్టుకోబడలేదని ఆయనఅన్నారు. దీనితో విద్యుత్ ఇంజనీర్లు నిబంధనలప్రకారం పని ఆందోళనను ప్రారంభించవలసివచ్చినదన్నారు. ఈ చివరి నిముషంలోనయినా అధికారులు నిర్మాణాత్మకమయిన చర్యలు తీసుకొనట్లయితే పరిస్థితి విషమించే అవకాశాలు వున్నాయని ఆయన పేర్కొన్నారు.

రాష్ట్ర విద్యుచ్ఛక్తి సంస్థలో ఇంజనీర్లకు ప్రాతినిధ్యం ఇవ్వాలని విద్యుత్ ఇంజనీర్ల వేతన వ్యవస్థను క్రమబద్ధం చేయడానికి వేతన సంఘాన్ని నియమించాలని, షిఫ్టు అలవెన్సు మొదలయిన వాటిని ఇవ్వాలని తాము కోరుతున్నామన్నారు. స్వ.వి.

## నేటి పంచాంగం

శ్రీ ఆనందనామ సం. జ్యేష్ఠ శు. పాడ్యమి: 1974 వ సం. మే 22 బుధవారం బుధ: శుద్ధ పాడ్యమి: రా. 11.35, కృత్తిక: ఉ. 7.17, రోహిణి: తె. 5.31, వర్జ్యం: రా. 10.07 మొదలు 11.36 వరకు.

1974 వ సం. మే 23 గురువారం గురు: శు. విదియ: రా. 8.51, మృగశిర: రా. 3.32, వర్జ్యం: ప. 10.39 మొదలు 12.07 వరకు.

– శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 — 1972)

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
పరవర యప్రియము తన మనంబునకగు దా
వొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ ఆనందనామ సం. జ్యేష్ఠ శు. పాడ్యమి:
బుధవారం

## కల్తీసారాయి ప్రమాదాలు

—:o:—

మద్యపాన నిషేధాన్ని తొలగించిన తరువాత కల్తీసారాయి తాగటం తగ్గిపోదని పెదవడ్లపూడిలో జరిగిన విషాద సంఘటన మరొకసారి గుర్తు చేస్తోంది. ఇంతకిముందు సూర్యాపేటలో ఎందరో కల్తీసారాయి తాగి మరణించారు. సూర్యాపేట సంఘటనకిపూర్వంజగ్గయ్యపేటలో ఇటువంటిదే ఒకటి జరిగింది. ఈ మూడు పక్క పక్క జిల్లాలలో జరగటం గమనించతగిన విషయం. మద్యపాన నిషేధం వలన ప్రభుత్వానికి ఆదాయంతగ్గుతోందని వాదించే వారు నిషేధాన్ని అమలు పర్చటం తేలిక కాదంటారు. నిషేధాన్ని అమలుపరచటం కోసం అయ్యేఖర్చు మరీ అధికంగా ఉంటుందని కూడా వారంటారు. ఈ విధంగా వాదించే వారు కొందరు అక్రమంగా తయారయ్యే సారాయి ఉత్పత్తి మద్యపాన నిషేధం తొలగిస్తే నిలిచిపోతుందని, కల్తీసారాయి ప్రమాదం తగ్గుతుందనీ వాదిస్తారు. వారి వాదన సరయినది కాదని పెదవడ్లపూడి సంఘటన తెలుపుతోంది. సారాయి వంటి పదార్థాలమీద ప్రభుత్వం సుంకాలు విధించటానికి ప్రయత్నించటంలో ఆశ్చర్యం లేదు. మత్తు, నిషా కలిగించే వాటన్నిటి మీద అన్ని ప్రభుత్వాలు ఆదాయాన్ని పెంచుకోవాలని ప్రయత్నిస్తూనేఉంటాయి. సారాయి కల పానీయాల వాడకం ఎక్కువ అయిపోతుందనిపించినప్పుడు కూడా అధికారులు వాటిమీద సుంకాలు పెంచుతూ ఉంటారు. సుంకాలు పెరిగితే అక్రమంగా జరిగే ఉత్పత్తి కూడా పెరుగుతూ ఉంటుంది. ఇటువంటి సారాయిలో కల్తీ అధికంగా జరుగుతూ ఉంటుందనిపిస్తుంది. సారాయి వాడకాన్ని తగ్గించటానికి దండన విధించే పద్ధతులకన్న ప్రచారమే ఎక్కువ ఉపయోగపడుతుందనవచ్చు. మహాత్మాగాంధిగారి కాలంలో జరిగినంత కాకపోయినా కొంతవరకయినా మద్యపానానికి వ్యతిరేకంగా ప్రచారం జరగాలి. ఈ విషయంలో పెద్ద పదవులలో ఉన్నవారే ఇతరులకి మార్గదర్శకులు కావాలి. ఇదంతా ఎలాగ ఉన్నప్పటికీ పోలీసు, ఇతర అధికారులు మరింత అప్రమత్తతతో వ్యవహరించాలి. పెదవడ్లపూడి సంఘటనవలన నష్టపోయిన వారందరికీ ఇతరుల హృదయపూర్వకమయిన సానుభూతి ఉంటుంది.

# వికలాంగులకు ఆశాజనకమైన భవిష్యత్తు

కార్మికవర్గాలకు అనేక విధాలుగా సాంఘిక భద్రతాసౌకర్యాలున్నాయనే విషయం అందరికీ తెలిసినదే. సమాజంలో కొంతవరకు దురదృష్టవంతులుగా వున్న సభ్యులు అంటే వికలాంగులు, వయోవృద్ధులకు కూడా తగిన విధంగా సహాయపడడానికి ప్రభుత్వ సంస్థలు, స్వచ్ఛందసేవా సంస్థలు ప్రత్యేక పునరావాస పథకాలు రూపొందించి వాటిని అమలు జరుపు తున్నాయి.

మన దేశంలో ముఖ్యంగా స్వాతంత్ర్యానంతరం, రెడ్‌క్రాస్ సొసైటీ, మొదలయిన సంస్థలు కొన్ని వికలాంగుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని ప్రత్యేకంగా కొన్ని సంక్షేమ పథకాలను ఆచరణలో పెట్టడంలో ప్రముఖ పాత్ర వహించాయి. ఈ సంస్థలు కాక దయార్ద్రహృదయులు కొందరు వ్యక్తిగతంగా కూడా ముందుకువచ్చి వికలాంగుల శ్రేయస్సుకోసం పాటుపడుతున్నారు.

1950 లో అమలులోకి వచ్చిన మన రాజ్యాంగం ధ్యేయం శ్రేయోరాజ్యస్థాపన. ఆ తరువాత వచ్చిన ప్రణాళికాయుగం సాంఘిక సంక్షేమ పథకాలకు నూతనోత్సాహం కల్పించింది. ఈ పథకాల అమలులో రాష్ట్రాల భాగస్వామ్యం అత్యంతకీలకమైనది.

* * *

ఆంధ్రప్రదేశ్‌లో అనేక సంవత్సరాలుగా సాంఘిక సేవాసంస్థలు ప్రశంసనీయంగా కృషి చేస్తున్నాయి.

జిల్లా స్థాయిలో భీమవరంలో అంధుల సమూహనా పాఠశాల, విశాఖపట్నంలో వికలాంగులైన పిల్లలకొరకు రాణిచంద్రమణి దేవి శిశువుల చికిత్సాలయం, పునరావాస కేంద్రం, గుంటూరులో బాపూజీ అంధులసమూహనా పాఠశాల, వికలాంగుల శ్రేయస్సుకొరకు గణనీయమైన కృషి చేస్తున్నాయి.

### ఉపాధికల్పన

వికలాంగులను ఉపయోగకారులైన సభ్యులుగా పరిగణించడానికి సమాజం చిరకాలం నుంచి వెనుకాడటంచేత ఉపాధికల్పన సమస్యగా ఉంటోంది. ఈ సమస్యను అధిగమించడానికి 1956—57 సంవత్సరంలో కొంత కృషి చేయటం జరిగింది. అప్పుడు అంధులకు ఉద్యోగావకాశాలను ప్రోత్సహించే సంకల్పంలో, కేంద్రప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖ ఒక వర్కుషాప్‌ని ఏర్పాటు చేసింది. అంతర్జాతీయ కార్మిక సంస్థవారు, వికలాంగుల ఉద్యోగావకాశాలను అభివృద్ధిపరచడానికి సలహా ఇవ్వే నిమిత్తం ఒక నిపుణుని పంపారు.

ఆయన సలహాప్రకారం భారతదేశంలో వికలాంగుల కొరకు ప్రత్యేక ఉపాధికల్పన కార్యాలయాలు ఏర్పాటు చేయబడ్డాయి. హైదరాబాదులో ప్రత్యేక ఉపాధికల్పనా కార్యాలయాన్ని 1962 సెప్టెంబరులో స్థాపించడం జరిగింది.

### ప్రజాభిప్రాయం

1969 నుంచి 1974 దాకా మొత్తం 1483 మందికి ఉద్యోగాలు లభించాయి. ఒక్క రాష్ట్రప్రభుత్వంలోనే 812 మందికి ఉపాధి సౌకర్యం లభించింది. వికలాంగులకు విస్తృతంగా వుద్యోగఅవకాశాలు లభించడానికి వీలుగా ప్రజాభిప్రాయం సుముఖంగా రూపొందుతున్నదనడానికి యిది ఒక తార్కాణం.

* * *

వికలాంగులకై ప్రత్యేక ఉపాధికల్పనా కేంద్రాలను ఏర్పాటు చేయడమేగాక వీరి గురించి రెండు వృత్తి శిక్షణ పునరావాస కేంద్రాలను కూడా నెలకొల్పడం జరిగింది. ఒకటి హైదరాబాదులోను, రెండవది బొంబాయి లోనూ వుంది.

### రాష్ట్రప్రభుత్వ రాయితీలు

రాష్ట్ర ప్రభుత్వం ఆయాశాఖలలో వికలాంగుల నిమిత్తం 3 శాతం పోస్టులను ప్రత్యేకించింది. గరిష్ఠవయఃపరిమితి పూర్వం మరో 10 సంవత్సరాలు వరకూ పెంపును వికలాంగుల విషయంలో పెంచడం జరిగింది. రాష్ట్ర పబ్లిక్‌సర్వీస్‌కమిషన్ ఆయా దరఖాస్తులపై నమూనా చేసే ఫీజు వికలాంగులు చెల్లించనక్కరలేదు.

హైదరాబాద్‌లోని వయోజన అంధుల శిక్షణాకేంద్రం వారు జారీ చేసే సర్టిఫికేట్లను మనరాష్ట్రంలోని ప్రభుత్వ రంగంలోనూ, ప్రయివేటు రంగంలోనూ గల పరిశ్రమలూ, కార్యాలయాలలో గుర్తిస్తారు. వికలాంగుల ప్రత్యేక ఉపాధి కల్పనాకేంద్రాలకు వెళ్ళడానికీ, అక్కడనుంచి రావడానికీ అదేవిధంగా ఇంటర్వ్యూలకు హాజరు కావడానికి అక్కడనుంచి తిరిగిరావడానికీ వికలాంగులకు ఉచితప్రయాణపు సౌకర్యాన్ని రాష్ట్ర రోడ్డురవాణాసంస్థ కల్పిస్తోంది.

### వృద్ధులకు ఆశ్రయ గృహాలు

మామూలు సాంఘికసేవా కార్యక్రమాల క్రింద సాంఘిక సంక్షేమశాఖ వృద్ధులకు, వికలాంగులకు సంబంధించిన రెండు ఆశ్రయ గృహాలను యీశాఖ నిర్వహిస్తోంది. ఒకటి హైదరాబాదులోను, మరొకటి విజయవాడలోనూ వున్నాయి.

ఇవికాక మరూడు అనాథశరణాలయాలు—హైదరాబాదు, వరంగల్లు కాకినాడలలో—నిర్వహింపబడుతున్నాయి. వికలాంగులైన మసలి నిరాశ్రయులకు వృద్ధాప్యపు పింఛనులను యిచ్చే పథకాన్ని ఆయా జిల్లా కలెక్టర్లు యిప్పుడు అమలు జరుపుతున్నారు.

ముందు ముందు యీ రంగంలో మరింత ఎక్కువ బాధ్యతవహించవలసిన అవసరం రాష్ట్రాలకు వున్నది. వికలాంగులను ప్రయోజనకరమైన పౌరులుగా రూపొందించేందుకు ఐదవ పంచవర్ష ప్రణాళిక నూతన మార్గాలను కల్పిస్తున్నది. అందుకే వారి భవిష్యత్తు ఆశాజనకంగా వుండగలదని నిస్సంశయంగా చెప్పవచ్చు.

### శ్రీ ఖాట్టం శ్రీరామమూర్తి
సాంఘిక సంక్షేమ శాఖామంత్రి

సెనెగల్ అధ్యక్షుడు శ్రీ సెదార్ సెంఘార్ శనివారంనాడు ఢిల్లీ వచ్చినప్పుడు రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరి, ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ప్రభృతులు స్వాగతమిచ్చిన దృశ్యం.

## చిత్ర విచిత్రం ✳ శ్రీనివాస్

## 'ఆనాటి రాణి'

ఒకప్పుడు కళాసామ్రాజ్యానికి రాణిగా రాజ్యం ఏలిన యీవిడకు ఏం తక్కువని మన దర్శకులు, నిర్మాతలు వదిలేస్తున్నారు. అందానికి ఏంతక్కువ? అభినయ కౌశలానికి ఏం తక్కువ? ఇవన్నీ వుండబట్టే ఆరోజులలో ఆమెను పెద్ద నిర్మాతలు, పేరుమోసిన దర్శకులు పెద్దపాత్రలనిచ్చి ప్రోత్సహించారు. ఆమె కూడా అవధులమేరకు పాత్రలను పోషించి ప్రేక్షకులను మెప్పించింది.

మన అగ్రశ్రేణి కథానాయకులయిన నాగేశ్వరరావు, రామారావు, శోభన్‌బాబు, కృష్ణలతో రొమాంటిక్ హీరోయిన్‌గా నటించింది.

ఈమెను యిటీవల ఒక సినిమాలో డ్యాన్సు స్టారుగా చూశాను. ఈమెలో యవ్వనం బుసలు కొడుతున్న నిజాన్ని నమ్మగలిగాను.

మన నిర్మాతలు యీమెను నాయికగా గాకపోయినా, వ్యాంపుగా నయినా తీసుకోవచ్చు. వ్యాంపులేని మన పరిశ్రమలో యీమె [illegible] వెలుగుతుంది.

# పరీక్షా పత్రాలను దిద్దడానికి ప్రతిఫలాన్ని పెంచాలనివిజ్ఞప్తి

కర్నూలు, మే 21: ఎస్. ఎస్. సి. పరీక్షల సమాధాన పత్రాలను దిద్దడానికి మంజూరు చేసే ప్రతిఫలాన్ని పత్రానికి 45 పైసల నుంచి ఒక రూపాయికి పెంచాలని సమాధాన పత్రాలను దిద్దే వారందరూ నిన్న ఇక్కడ సమావేశమై రాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

ప్రధాన పరీక్షాధికారికి యిచ్చే రోజువారీ భత్యాన్ని 25 రూపాయలకు, ప్రత్యేక సహాయ పరీక్షాధికారికి యిచ్చే ప్రతిఫలాన్ని ఎనిమిది రూపాయలకు పెంచాలని కూడా వారు కోరారు. తమ మకాం సమయంలో కరువు భత్యాన్ని పది రూపాయలకు పెర్పించాలని కూడా వారు కోరారు. 24 వ తేదీ లోగా తమ కోర్కెలకు ప్రభుత్వం అంగీకరించక పోయినట్లయితే తాము ప్రత్యక్ష చర్యకు దిగవలసివస్తుందని వారు హెచ్చరించారు.

### భారీ వర్షాలు

కర్నూలులో నిన్న భారీ వర్షం కురిసింది. ఇంతవరకు 70.5 మిల్లీమీటర్ల వర్షం పడింది.

పత్తికొండ, డోన్, నందికొట్కూరు ప్రాంతాలలో కూడా వర్షాలు పడినట్లు వార్తలు వచ్చాయి. వ్యవసాయ పనులకు ఈ వర్షం చాలా మంచిది.

### సంజీవయ్య వర్ధంతి

స్వర్గీయ దామోదరం సంజీవయ్య ద్వితీయ వర్ధంతి ఉత్సవాన్ని శ్రీ రామనగర్ నివాసులు శ్రీ కె. నాగిరెడ్డి అధ్యక్షతన మొన్న ఇక్కడ నిర్వహించారు. సంజీవయ్య జయంతి సందర్భంగా స్మారక తపాలా బిళ్ళను జారీ చేయవలసిందిగా వక్తలు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. శ్రీ సంజీవయ్యకు తగిన స్మారక చిహ్నాన్ని ఏర్పాటు చేయవలసిందిగా ప్రజలను కోరారు. మాజీ మంత్రి శ్రీ దామోదరం మునిస్వామి, శ్రీయుతులు మాదన్న, శేషన్న, రహింఖాన్, తిమ్మారెడ్డి, చురన్‌లాల్ ప్రభృతులు కూడా ప్రసంగించారు. శ్రీ జంపాల శివయ్య వందన సమర్పణ చేశారు.

### రచయితల సభ

కర్నూలు జిల్లా అభ్యుదయ రచయితలు ఇక్కడ సమావేశమై జులైలో జిల్లా మహాసభ జరుపాలని తీర్మానించి ఆహ్వాన సంఘాన్ని ఏర్పాటు చేశారు. స్వ.వి

## తాళ్ళపాకలో అన్నమాచార్య మందిరం

హైదరాబాదు మే 21: శ్రీ తాళ్ళపాక అన్నమాచార్య జన్మస్థలమైన కడపజిల్లా తాళ్ళపాక గ్రామంలో లక్షరూపాయలలో తిరుపతి దేవస్థానంవారు ఆశ్రమాన్ని మందిరాన్ని నిర్మిస్తున్నారని అన్నమాచార్యం ఉత్సవంలోపాల్గొని తిరిగి వచ్చిన దేవదాయశాఖా మంత్రి శ్రీ రాజాసాగి సూర్యనారాయణరాజు నేడు చెప్పారు.

ఆగ్రామంలో ఒక శివాలయం విష్ణాలయం వున్నాయని అవి ఇంకా బాగా జరిగేట్టు చూడవలసి వున్నదన్నారు.

—:o:—

### గ్రామ పంచాయతీ ఉద్యోగికి శిక్ష

హైదరాబాద్, మే 21: శ్రీ అహమ్మద్ సిద్దికీఅలీ, గ్రామ పంచాయతీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు కల్వకుర్తికి హైదరాబాద్ స్పెషల్ జడ్జి రెండు నెలల మామూలు జైలు శిక్ష విధించారు.

కల్వకుర్తికి చెందిన శ్రీ ఎస్. నరసింహయ్య అనే వారికి వృత్తిపన్ను మదింపులో వెసులుబాటు చూపడానికి రు. 25లు అడిగి తీసుకున్నందుకు శ్రీ సిద్దికీఅలీపై కేసు పెట్టారు. అవినీతి నిరోధక శాఖ ఈ కేసును దర్యాప్తు చేసింది.

—:o:—

### షేక్ అబ్దుల్లా

శ్రీనగర్, మే 21: విదేశాంగ మంత్రి శ్రీ స్వరన్‌సింగ్ ఆతిథ్యాన్ని స్వీకరించిన కాశ్మీర్ నాయకుడు షేక్ అబ్దుల్లా దాదాపు 90నిమిషాల సేపు శ్రీ స్వరన్‌సింగ్‌తో సమాలోచనలు జరిపారు. మరెవ్వరూ ఈ సమాలోచనలలో పాల్గొనలేదు.

సెనిగల్ అధ్యక్షుని గౌరవార్థం ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి గతరాత్రి ఇచ్చిన విందులో షేక్ అబ్దుల్లా దంపతులుకూడా పాల్గొన్నారు.

### వెండి ధర

మే 21:

హైదరాబాదు మార్కెట్

| | | |
|---|---|---|
| వెండి 1 కిలో | రు. | 1225—00 |
| " 10 గ్రాములు | రు. | 12—75 |

## దినఫలం

22-5-1974 బుధవారం

శక సం. 1896 జ్యేష్ఠమాసం 1

★ మేషం: కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

★ వృషభం: మీ కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

★ మిథునం: చికాకులు ఏర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. పుణ్య కార్యాలు చేస్తారు.

★ కర్కాటకం: వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి.

★ సింహం: అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

★ కన్య: అన్ని వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

★ తుల: ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

★ వృశ్చికం: వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. కుటుంబ సంతోషం లభిస్తుంది.

★ ధనుస్సు: రాజకీయ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

★ మకరం: వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

★ కుంభం: మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

★ మీనం: వ్యాపారవిస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

– మహేష్.

# ఆచూకీ తీయడంలో అధికారుల అవస్థలు

ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధి

మంగళగిరి, మే 21: మంగళగిరి ప్రభుత్వ ఆసుపత్రి అంతా మొన్నటినుంచి మంచి హడావుడిగ ఉన్నది. కల్తీ సారా త్రాగి అస్వస్థులయినవారిలోను, వారిని చూడడానికి వచ్చి పోయే బంధుమిత్రులలోను, సారా త్రాగి ఉపవాసంవిషాద పరీక్ష చేయించుకోడానికి వచ్చే వారితోను ఆసుపత్రి నిండి పోయింది. ఆసుపత్రి వైద్య అధికారి డాక్టర్ టి. వీరయ్య, ఆయన భార్య, సహ వైద్యురాలు అయిన శ్రీమతి టి. ఇందిరాదేవి, ఆసుపత్రిలోని యితర సిబ్బంది నిద్రాహారాలు లేకుండా, విరామం లేకుండా మొన్న ఉదయం నుంచీ వచ్చిన రోగిని వచ్చినట్లుగా పరీక్ష చేసి, అంతగా ప్రమాదం లేకపోతె ఇక్కడే చికిత్స చేసి అవసరమయితే ఇన్ పేషెంట్లుగా చేరుస్తున్నారు. ఇన్ పేషెంట్‌లుగా చేర్చబడినవారిలో కొంతమందిని మరికొంత చికిత్స కోసం పోలీసు వ్యానులలో గుంటూరు జనరల్ ఆసుపత్రికి తరలిస్తున్నారు.

కల్తీ సారా త్రాగి అస్వస్థతపాలయిన వారి సంగతటుంచి, మామూలుగా ఇతర చోట్ల సారా త్రాగినవారు కూడా అధిక సంఖ్యలో ఆసుపత్రికి రావడం జరిగింది. అయ్యా నేను కూడా సారా త్రాగాను. ఒకసారి పరీక్ష చేసి పంపేయండి'' అని వారు అడగడం, వైద్యులు వారిని పరీక్ష చేసి, అవసరమయితే గుంటూరు పంపించడం జరుగుతోంది. సారా త్రాగినవారిలో అధిక సంఖ్యాకులు వ్యవసాయ కూలీలు. మంగళగిరి ఆసుపత్రి నుంచి నిన్న గుంటూరు జనరల్ ఆసుపత్రికి 20 మందిని పంపించారు. గుంటూరులో మొత్తము 35 మందిని నిన్న కొత్తగా చేర్చుకున్నారు. మంగళగిరిలో మొన్నటినుంచి 100 మందిని అవుట్ పేషెంట్లుగా చికిత్స చేసి పంపేశారు. కల్తీ సారా త్రాగినవారిలో ఇక్కడ ఆరుగురు మరణించారు. మరోకరి పరిస్థితి విషమంగా ఉన్నది. ఆసుపత్రి సిబ్బంది ఆ రోగిని కంటికి రెప్పలా చూస్తున్నారు. పెదవడ్లపూడి ఆ పరిసరాలలోనే కల్తీ సారా త్రాగడం వల్ల ఎక్కువమంది మరణించారు.

ప్రత్యక్ష సాక్షులు చెప్పిన దాని ప్రకారం పెదవడ్లపూడి సినిమాహాలు ప్రక్కన సారా దుకాణం ఉన్నది. జమలయ్య అనే వ్యక్తి దాని యజమాని. ఈ సారా దుకాణానికి మంగళగిరినుంచి సుబ్బారెడ్డి కంపెనీ సారాను సరఫరా చేస్తుంది. సినిమాహాలు ప్రక్కనే ఉండడం వల్ల సినిమాకు వచ్చినవారు రావేంద్రపాడు, పెదవడ్లపూడి గ్రామాలలో వివాహాలకు వచ్చినవారు 18వ తేదీ రాత్రి జమలయ్య దుకాణంలో సారా త్రాగారు. చాలామంది ఆ తర్వాత వారి వారి వూర్లకు పోయారు. సారాలో ఏదో రసాయన పదార్థం, నిషాను పెంచేది కలిపి ఉంటుందని అనుమానిస్తున్నారు. సారా త్రాగిన వారం దరూ ఒకే వూరివారు కాకపోవడం వల్ల సారా ఎంతమంది త్రాగారో ఖచ్చితంగా ఎంతమంది అస్వస్థులయినారో, ఎంతమంది మరణించారో అధికారులకు అంతుచిక్కడం లేదు. కొన్ని చోట్ల మరణించినవారికి అంత్యక్రియలు జరిగిపోయినట్లు అధికారులకు వర్తమానం అందుతోంది. మంగళగిరి కంట్రాక్టరే తాడేపల్లి మొదలయిన చోట్లకు సారాను సరఫరా చేస్తాడని తెలిసింది.

తుళ్ళూరుకు చెందిన పెదరామయ్య అనే వ్యక్తికి సంబంధించిన ఉదంతం నిన్న సాయంకాలం పోలీసులకు తెలియవచ్చింది.

పెదరామయ్య తన కుమార్తె వివాహం కోసం రేవేంద్రపాడు వచ్చాడు. కాలువకు అవల ప్రక్కన ఉన్న పెదవడ్లపూడి వెళ్ళి సారా దుకాణంలో బాగా సారా పట్టించి మరుసటి రోజు కూతురును అల్లుడిని వెంటపెట్టుకుని తుళ్ళూరు వెళ్ళిపోయాడు. అక్కడ మొన్న మధ్యాహ్నం మరణించాడు. అతడి మృతదేహాన్ని ఖననం చేసేశారు. ఎవరో చెప్పిన మీదట నిన్న బంధువులు వచ్చి ఇక్కడ పోలీసులకు పెదరామయ్య మరణం గురించి ఫిర్యాదు చేశారు. ఇలాంటి కేసులు పోలీసుల దృష్టికి చాలా వస్తున్నాయి.

సహజమయిన మరణం సంభవించిన సందర్భాలలో మరణించినవారి బంధువులు ప్రభుత్వ సహాయం అందుతుందనే కారణంలో తర్వాత వచ్చి ఫిర్యాదు చేస్తున్నారేమోనని అధికారులకు ఒక సందేహం ఎదురయింది. అందుకని బాగా ఆరాతీసిన తర్వాతగాని వారు కేసును రికార్డు చేయడంలేదు. కల్తీసారాత్రాగిన వారిలో అనేక మంది స్త్రీలు కూడా వుండడం విశేషం. మరణించిన వారిలో ఒక స్త్రీ కూడా వున్నది.

కల్తీసారాత్రాగినవారు ఏయే గ్రామాలలో వున్నారో ఆరా తీయడం పోలీసు, రెవెన్యూ శాఖకు కష్టమయిపోతోంది. అయినా రూరల్ డి. ఎస్. పి. శ్రీ లక్ష్మీనారాయణ ప్రత్యక్ష పర్యవేక్షణలో ప్రత్యేక పోలీసు అధికారుల దళం నిన్నటినుంచి విరామం లేకుండా మంగళగిరి, పెదవడ్లపూడి, తాడేపల్లి ప్రాంతాలలో దర్యాప్తు చేస్తున్నారు.

మంగళగిరి పోలీసు స్టేషన్‌లో పోలీసులు సారా పీపాలకు, సారా డబ్బాలకు సీళ్ళు వేయడం కన్పించింది. పోలీసులు 2000 లీటర్ల సారాను స్వాధీనం చేసుకొన్నారు. ఈ సారా మచ్చును రసాయనిక పరీక్షకోసం పంపిస్తున్నారు.

క్రయిమ్‌బ్రాంచి సి. ఐ. డి. అధికారులు తమ సిబ్బందితో కూడా ఇక్కడ మకాం వేసి అనుమానితులనుపట్టుకొనివచ్చిప్రశ్నిస్తున్నారు. సారా కంట్రాక్టర్ శ్రీ సుబ్బారెడ్డిని అరెస్టు చేశారు. మిగిలినవారికోసం గాలిస్తున్నారు.

నిన్న సాయంకాలానికి మరణించినవారి సంఖ్య 27 కి పెరిగింది. తెనాలి, మంగళగిరి, గుంటూరు ఆసుపత్రులలో 123 మంది చికిత్సపొందుతున్నారు. డి. ఎం. ఓ. శ్రీ జి. సోమసుందరం ఇక్కడ మకాంచేసివున్నారు. కల్తీసారా త్రాగి మరణించిన 27 మంది పేర్లు ఇవి: బి. వీరయ్య, సి.హెచ్. యలమంద, బి. వెంకట్రామయ్య కోటయ్య మరియాదాసు, షేక్‌జానీ, ఎస్. సాంబశివరావు, ఎల్. అప్పలస్వామి, జె. వెంకటేశ్వర్లు, కె. పాండు, సి. అంజయ్య, పి. పాపయ్య, కె. సుబ్బారాయుడు, ఎం. నాగయ్య, షేక్‌మస్తాన్, సి.హెచ్. వీరయ్య, ఎం. పెదరామయ్య, ఇ. భుజంగరావు, జె. ప్రకాశరావు, పి. బుడే, జె. బుడే కె. వరమ్మ, కె. ఏసు, సి. వెంకటేశ్వర్లు, టి. నాగరాజు, జి. సాంబశివరావు, మునాకరరావు.

## లెవీ ఎగవేత: మిల్లర్ అరెస్టు

హైదరాబాద్ మే 21: నిఘా విభాగం సిబ్బంది ఈ నెల 14 వ తేదీన తూర్పు గోదావరిజిల్లా రామవరంలోని చంద్రశేఖరా రైసుమిల్లును తనిఖీచేసి జిల్లాకలక్టరు నిర్ణయించిన లెవీని ఎగవేసినందుకు మిల్లు యజమాని పి. కామేశ్వరరావును అరెస్టు చేశారు. 32 వేల రూపాయల విలువయిన 116 క్వింటాళ్ల ధాన్యం, 105 క్వింటాళ్ల బియ్యం, రెండు క్వింటాళ్ల నూకలను స్వాధీనం చేసుకొని రామచంద్రపురం పోలీసు స్టేషన్‌లో కేసు నమోదు చేశారు.

నెల్లూరుజిల్లా కోవూరులోని శ్రీ వెంకట సుభాషిణి బియ్యం మిల్లుకు, సంబంధించిన మిల్లరు టోకు వర్తకుల నిల్వలను నిఘా విభాగం సిబ్బంది తనిఖీచేసి 1.03 లక్షల రూపాయలు విలువయిన 323 బస్తాల బియ్యం, 122 బస్తాల నూకలు, 1206 బస్తాల ధాన్యం స్వాధీనం చేసుకొని డి. వెంకటేశ్వర్లు, ఎస్. వీరరాఘవయ్య, డి. వెంకట సుబ్బయ్య, సి. హెచ్. రాధాకృష్ణయ్యలను అరెస్టుచేశారు.

హైదరాబాద్ బేగంబజార్‌లోని ఇండో ట్రేడింగ్ కంపెనీపై నిఘా విభాగంవారు వలపన్ని తుషార్ వనస్పతి బ్లాక్‌మార్కెట్‌లో విక్రయిస్తున్నందుకు సంస్థ యజమాని అబ్దుల్ సత్తార్‌ను అరెస్టుచేశారు. 12 వేల రూపాయల విలువయిన వనస్పతిని స్వాధీనం చేసుకున్నారు.

—o:o—

### అణుశక్తి పరీక్ష: ధిల్లాన్ సమర్థన

ఆక్లండ్, న్యూజిలాండ్, మే 21: తమ దేశం అణుశక్తి పరీక్ష జరుపటాన్ని భారత్ లోక్‌సభ సభాపతి శ్రీ జి. ఎస్. ధిల్లాన్‌గట్టిగా సమర్థిస్తూ, తమ పొరుగున గల చైనాకు అణ్వస్త్రాలు కలవని చెప్పారు.

కామన్వెల్తు పార్లమెంటరీ యూనియన్ సమావేశంలో పాల్గొనడానికి ధిల్లాన్ ఇక్కడకు వచ్చార.

అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించుకునేందుకు మేము పరీక్షలు జరిపితే విమర్శిస్తున్నారని కాని ప్రతివారు అణ్వస్త్ర పరీక్షలు జరుపుతున్నారని ఆయన చెప్పారు.

### ఆలమూరులో సాహితీ సదస్సు

ఆలమూరు, మే 21: చింతలూరు వేంకటేశ్వర ఆయుర్వేద నిలయం యజమాని శ్రీ ద్విభాష్యం వెంకట సూర్యనారాయణమూర్తి ఇటీవల ఇక్కడ లక్ష్మీ ధన్వంతరి కల్యాణ సాహితీ సదస్సును ఏర్పాటు చేశారు. సదస్సులో శ్రీయుతులు జమ్మలమడక మాధవ రామశర్మ, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, కరుణశ్రీ, దువ్వూరి నారాయణశాస్త్రి దేవర ఉమామహేశ్వరశాస్త్రి, పోలేటి సుబ్బరాయశాస్త్రి, ద్వివేది సత్యనారాయణమూర్తి ప్రభృతులు పాల్గొన్నారు. కవులను శ్రీ సూర్యనారాయణమూర్తి నూతన వస్త్రాలతోను, నూటపదార్లతోను సత్కరించారు. మరునాడు వేదపండితులను ఆయన సత్కరించారు. శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ బృందం 'ఉషాపరిణయం' నృత్యనాటికను ప్రదర్శించారు.

శ్రీ సూర్యనారాయణ తమ కుమారుడు చి. వెంకటేశ్వర ధన్వంతరికి, శ్రీ నరసింహదేవర జనార్దన శాస్త్రి మనుమరాలు చి. సౌ. లక్ష్మితో వివాహం సందర్భంగా ఈ సాహితీ సదస్సును ఏర్పాటు చేశారు.

### ఒకని దుర్మరణం

విజయనగరం, మే 21: మొన్న రాత్రి ఇక్కడ భారీ వర్షం కురిసింది. పెనుగాలి వీచింది. కరెంటుతీగ తెగి మీదపడడంతో మోహదా నరసింహులు అనే మునిసిపల్ ఉద్యోగి దుర్మరణం పాలయ్యాడు. నరసింహులుసైకిలు మీద వెడుతుండగా ఈ దుర్ఘటన జరిగింది. అతడి మృతదేహాన్ని నిన్న బంధువులకు అప్పగించారు.

### శ్రీ జయప్రకాశ్

పాట్నా, మే 21: సర్వోదయ నాయకుడు శ్రీ జయప్రకాశ్‌నారాయణ, వెల్లూరు ఆసుపత్రి నుంచి విడుదలై జూన్ 2కు ఇక్కడికి వచ్చి జూన్ 5న బీహారు గవర్నరు వద్దకు వెళ్ళే పెద్దవూరేగింపునకు నాయకత్వం వహించగలరని ప్రకటన జరిగింది.

### మంత్రి శ్రీ భాట్టం

హైదరాబాద్, మే 21: సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ఈ నెల 27 వ ఢిల్లీ వెడతారు. 30 వ తేదీకి అక్కడనుంచి తిరిగి వస్తారు.

## మాఊరి సమస్య

### కుమార్‌పల్లి సమస్య
(10రూ.లుబహుమతిపొందినలేఖ)

వాడ కుమార్ పల్లి హన్మకొండ బస్టాండుకి కొంత దూరంలో ఉంది మా వూరికి పాయిఖానాలేకజనం ఇబ్బంది పడుతున్నారు.

జంగ అశోక్ కుమార్, ఇం. నెం.3—7—32. కుమార్ పల్లి, హన్మకొండ, పోస్టు వరంగల్ జిల్లా.

## సుందరకాండ

—యామిజాల పద్మనాభస్వామి

### 59 వ సర్గ

ఏత దాఖ్యాయత త్సర్వం
హనుమాన్ మారుతాత్మజః
భూయ స్సముపచక్రామ
వచనం వక్తు ముత్తరమ్ 1

అనిలనందనుడు హనుమంతుడు ఇలా వృత్తాంతమంతా చెప్పి తిరిగి చెప్ప నారంభించాడు.

సఫలో రాఘవోద్యోగ
స్సుగ్రీవస్య చ సంభ్రమః
శీలమాసాద్య సీతాయా
మమ చ ప్రీణితం మనః 2

రఘురాముని ప్రయత్నం, మనరాజు ఉత్సాహం సఫలమయాయి. పతివ్రతా ధర్మాలను తు.చ. తప్పక పాటిస్తున్న సీతామహాదేవి శీలాన్ని గ్రహించి ఆనంద భరితమయింది నా మనస్సు.

అంత దుర్మార్గుని నిర్బంధములో, ఆలాటి రాకాసుల తర్జనభర్జనలకు లొంగక అగ్నిశిఖ లాగున్న సీతాదేవి శీలాన్ని ఎవ్వరూ ఏవిధంగానూ శంకించ నక్కరలేదని హనుమంతుని అభిప్రాయం.

ఆర్యాయాః సదృశం శీలం
సీతాయాః ప్లవగర్షభాః
తపసా ధారయేల్లోకాన్
క్రుద్ధా వా నిర్దహేదపి 3

పూజ్యురాలు సీతాదేవి తన శీలబలముతో, ఆర్యధర్మముతో కనికరించిందా లోకాలను కాపాడగలదు. కినుక వహించిందా సమూలంగా భస్మీపటలం చెయ్యగలదు.

(సశేషం)

## నలుగురు విప్లవ రచయితల అరెస్టు

హైదరాబాద్, మే 21: నలుగురు విప్లవ రచయితలు సహా ఏడుగురిని అరెస్టుచేశారు. కేంద్ర నేరారోపణ విభాగంవారు నమోదు చేసిన కుట్రకేసులో ఈ అరెస్టులు జరిగాయి. వీరిని మెజిస్ట్రేట్ ముందు హాజరు పరచగా జుడిషియల్ నిర్బంధంకు ఉత్తర్వుచేశారు.

ప్రభుత్వం పట్ల అసంతృప్తిని కలిగించడానికి రచయితలు ప్రయత్నించినట్లు ఆరోపణ చేశారు. సాయుధ విప్లవాన్ని ప్రబోధించారని కూడా ఆరోపణ. శ్రీయుతులు వరవరరావు, ఎం. టి. ఖాన్, మధుసూదనరావు, చెరబండరాజు అరెస్టు అయిన వారిలో ఉన్నారు.

### జూన్ 4న రిక్విజిషన్ సమావేశం

పాట్నా, మే 21: రాష్ట్ర ముఖ్యమంత్రిగా శ్రీ గఫూర్‌ను తొలగించాలని కోరుతున్న శాసన సభ కాంగ్రెస్ పార్టీ రిక్విజిషన్ సమావేశాన్ని జూన్ 4 న జరపాలని ఎనిమిది మంది అసమ్మతి వర్గీయులు నిన్న నిర్ణయించారు. వీరి ప్రతినిధివర్గం నేడు ఢిల్లీ వెడుతోంది.

## అభివృద్ధి లెవీ: శ్రీకాకుళం జిల్లా రైతులకు మంత్రి విజ్ఞప్తి

శ్రీకాకుళం, మే 21: మధ్యతరగతి నీటి పారుదల శాఖామంత్రి శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు పెదపెంకి పంచాయితీలో జరిగిన సభలో మాట్లాడుతూ ప్రభుత్వ సంస్థల ద్వారా పనులు చేయించుకొనే విషయంలో శ్రీకాకుళం, విశాఖపట్నం రైతులకు తగినంత శ్రద్ధ చూపడం లేదన్నారు. ప్రాజెక్టులను ప్రగతిని నిర్మించ డానికి వీలుగా రైతులు ముందుగానే అభివృద్ధి లెవీని కట్టడానికి బ్యాంకులో డిపాజిట్టు చేయాలని ఆయన సూచించారు. 16 గ్రామాలకు నీటి పారుదల సౌకర్యం కల్గించగల పెదకాలని రిజర్వాయర్ పథకాన్ని రూపొందించడం జరిగిందన్నారు. ఈ పథకం అమలుకు 64 లక్షల రూపాయలు ఖర్చవుతుందన్నారు. బొబ్బిలి, సాలూరు, పార్వతీపురం తాలూకాలకు ప్రయోజనం చేకూర్చగల బంటుమక్కువ, జంఝావతి పథకాల అమలు పట్ల గట్టి శ్రద్ధ చూపగలమని ఆయన వాగ్దానం చేశారు. స్వ.నా

## తాయ్‌లాండ్ మంత్రివర్గం రాజీనామా

బ్యాంకాక్, మే 21: తాయ్‌లాండ్ మంత్రివర్గం తన రాజీనామాను రాజా అతుల్య తేజకు సమర్పించింది.

ప్రధాని శ్రీ సన్య ధర్మశక్తి అధ్యక్షతన మంత్రివర్గ సమావేశంలో ఈ నిర్ణయం తీసుకోబడింది.

న్యూఢిల్లీ, మే 21: జనసంఘం కార్యవర్గం ఈ నెల 31 నుంచి ఇక్కడ సమావేశమై దేశ ఆర్థిక, రాజకీయ పరిస్థితులను చర్చిస్తుంది.

### బొంబాయిలో ధరలు తగ్గుముఖం

బొంబాయి, మే 21: బొంబాయి నగరంలో గత కొన్నిరోజులుగా ధరలు తగ్గుముఖం పట్టినట్లు మహారాష్ట్ర ప్రభుత్వంప్రధాన కార్యదర్శి విలేఖరులకు చెప్పారు. ధరలుజొన్నలు కిలో రు 2 నుంచి రు. 1—70కి పప్పులు కిలోకు 30 పైసలు అలాగే కూరగాయల ధరలు కూడా తగ్గించినట్లు ప్రభుత్వంసేకరించిన వివరాలను ఆయన వెల్లడించారు.

# గోలన్ రంగంలో సేనల ఉపసంహరణ: అమెరికా ప్రతిపాదనకు సిరియా సమ్మతి

టెలిఅవివ్, మే 21: గోలన్ రంగంలో సేనల ఉపసంహరణకు అమెరికా చేసిన ప్రతిపాదనను సిరియా అధ్యక్షుడు హాఫెజ అసాద్ ఆమోదించినట్టు ఇజ్రేల్ వార్తాసంస్థ తెలిపింది.

అమెరికా విదేశాంగ మంత్రి హెన్రీకిసింగర్ బృందంలోని సీనియర్ అధికారి పై విషయం తెలిపినట్టు ఇజ్రేల్ వార్తాసంస్థ వెల్లడించింది.

హెన్రీ కిసింగర్ డమాస్కస్ నుంచి నిన్న రాత్రి ఇక్కడకు వచ్చారు. చర్చలలో ప్రగతి సాధించబడినట్టు కిసింగర్ డమాస్కస్‌నుంచి బయలుదేరే ముందు చెప్పారు.

### చైనా–మలేసియా దౌత్యసంబంధాలు

కౌలాలంపూర్, మే 21: మలేసియా—పీపుల్స్ చైనాలు ఉభయదేశాల మధ్య పూర్తి దౌత్య సంబంధాలను నెలకొల్పుకుంటున్నట్టు నిన్న ప్రకటించాయి.

మలేసియా ప్రధాని టున్‌అబ్దుల్ రజాక్ మే 28 నుంచి జూన్ 2 వరకు చైనాలో పర్యటన జరుపుతారని కూడా ఆ ప్రకటన తెలిపింది.

### రాజ్యాంగం 33 వ సవరణ బిల్లుకు రాష్ట్రపతి ఆమోదం

న్యూఢిల్లీ, మే 21: రాజ్యాంగం 33వ సవరణ బిల్లు 1974 కు రాష్ట్రపతిఆమోదముద్ర లభించింది. పార్లమెంటు సభ్యులను శాసన సభ్యులను బలవంతంగా రాజీనామా చేయించడాన్ని నివారించడానికి ఈ బిల్లు ఉద్దేశించబడింది.

### ఎవరెస్టు శిఖరారోహణ యత్నం

ఖట్మాండు, మే 21: స్పానిష్ పర్వతారోహక బృందం సభ్యులిద్దరు ఎవరెస్టు శిఖరారోహణ యత్నంలో విఫలులయ్యారని నేపాల్ విదేశాంగమంత్రిత్వశాఖ నిన్న ప్రకటించింది.

ఈ బృందంలోని మరొక ఇద్దరు ఈ శిఖరారోహకులు మళ్లీ యత్నిస్తారని కూడా ఆ ప్రకటన తెలిపింది.

### అగ్నిప్రమాదం

మద్రాసు, మే 21: మే 18 వ తేదీ ఉదయం తిరుచ్చిలోని రజామలై కేంద్ర గిడ్డంగిలో అగ్ని ప్రమాదం సంభవించి 150 వేల రూపాయల విలువ గల ప్రొద్దు తిరుగుడు పిండి బస్తాలు దగ్ధమైనట్లు కేంద్ర గిడ్డంగి సంస్థ ప్రాంతీయ డైరెక్టర్ శ్రీ సాల్డానా చెప్పారు.

మే 18 న సాతనూర్ ప్రభుత్వ గిడ్డంగిలో అగ్ని ప్రమాదం సంభవించి 75 వేల రూపాయల విలువ గల గోధుమ, బియ్యం నిల్వలు దగ్ధమైనట్లు తొలి వార్తలు తెలుపుతున్నవి.

### 27 న ఫ్రెంచి కొత్త అధ్యక్షుని పదవీ స్వీకారం

పారిస్, మే 21: మే 27వ తేదీన తాను అధ్యక్ష పదవీ బాధ్యతలను స్వీకరిస్తున్నట్టు ఫ్రెంచి అధ్యక్షునిగా ఎన్నికైన వాలెరీగిస్కార్డ్ డిస్టాంగ్ నిన్న ప్రకటించారు.

తాత్కాలిక అధ్యక్షుడు అలెన్‌పోహర్‌ను కలుసుకున్న తర్వాత ఆయన ఈ ప్రకటన చేశారు.

# రాష్ట్రాలకు ప్రత్యేక సహాయం సాధ్యంకాదని కేంద్రం స్పష్టీకరణ: అదనపు వనరులు కూర్చుకోవాలని సలహా

న్యూఢిల్లీ, మే 21 : బడ్జెట్ అంచనాలలో లోటును భర్తీ చేసుకోవడానికి ప్రత్యేక సహాయం చేసే స్థితిలో కేంద్రం లేదని, రాష్ట్ర ప్రభుత్వాలకు నిర్మొహమాటంగా తెలియజేశారు.

వర్తమాన సంవత్సరానికి రాష్ట్రాలలో లోటు బడ్జెట్లు ప్రతిపాదించడం పట్ల కేంద్రం అసంతృప్తిని వ్యక్తం చేసింది.

వర్తమాన సంవత్సరంలోనే అదనపు వనరులకు కృషి చేసి బడ్జెట్ తేడాల సరిదిద్దడానికి కృషి చేయవలసిందిగా ఆర్థికమంత్రి శ్రీ వై.బి.చవాన్ రాష్ట్ర ప్రభుత్వాలకు వ్రాశారు.

ప్రస్తుత ద్రవ్యోల్బణ పరిస్థితి దృష్ట్యా అత్యవసరంకాని తక్కువ ప్రాధాన్యం గల ఖర్చులను తగ్గించవలసిందని రాష్ట్రాలకు శ్రీ చవాన్ సలహా యిచ్చారు.

తమ ప్రణాళిక పెట్టుబడులకు అదనపు వనరులను—ముఖ్యంగా వ్యవసాయరంగంపై పన్నుల ద్వారాను, నీటిపారుదల, విద్యుత్ రేట్ల సవరణ ద్వారాను—సమకూర్చుకోవలసిందిగా రాష్ట్రాలకు ఆయన మరల సూచించారు.

తక్కువ కాలంలో మంచి ఫలితాలను యిచ్చే పథకాలకు అత్యధిక ప్రాధాన్యం ఇవ్వవలసిందిగా ఆయన కోరారు.

పలు రాష్ట్రాల బడ్జెట్లలో ప్రారంభ నిలువలు లేకపోవడం, విపరీతమయిన లోట్లు చూపడం జరిగింది. ఈ బడ్జెట్లపై సమీక్ష జరిపిన తరువాత రాష్ట్రాలకు శ్రీ చవాన్ ఈ లేఖ వ్రాశారు. అదనపు వనరులకు పెద్ద రాష్ట్రాలు ఎలాంటి ప్రయత్నం చేయలేదు. వివిధ రాష్ట్రాల 74—75 బడ్జెట్లో ప్రారంభ నిలువలలో రు. 257.15 కోట్లు ఏడాది చివర లోటు 175 కోట్లు ఉన్నాయి.

—:0:—

## కృష్ణా జిల్లాలో ఎరువుల పంపిణీ

విజయవాడ, మే 21 : కృష్ణాజిల్లాలో మే, జూన్, జులైలలో నాలుగువేల టన్నుల ఎరువులు పంపిణీ అవుతాయి. ఆహారధాన్యాల పంటలకు 75శాతం, ఇతర పంటలకు 25 శాతం పంపిణీ చేస్తారు.

జిల్లా కలెక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ అధ్యక్షతన జిల్లా ఎరువుల సంఘం శనివారం నాడు సమావేశమై ఈ నిర్ణయం తీసుకున్నది. తహసీల్దార్లు జారీచేసిన గుర్తింపుకార్డులపై నిర్ణీత సహకార సంఘాల ద్వారా ఈ ఎరువుల పంపిణీ జరుగుతుంది.

## విబంధరాజ్యాల పాత్ర: టిటో వివరణ

బెల్‌గ్రేడ్, మే 21 : విబంధ రాజ్యాల, యితర బడుగు దేశాల ప్రమేయం లేకుండా ముఖ్యమయిన ఏ అంతర్జాతీయ సమస్య కూడా పరిష్కారం కాజాలదని యుగొస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో నొక్కి చెప్పారు.

యుగొస్లావ్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక 'కమ్యూనిస్టు' విలేఖరికి యిచ్చిన ఇంటర్వ్యూలో ఆయన మాట్లాడుతూ పై విధంగా చెప్పారు.

సమాన స్థాయిలో ఆర్థిక, రాజకీయ సంబంధాలు ఉండాలని మెజారిటీ దేశాలు చేస్తున్న వాదాన్ని సామ్రాజ్యవాద దేశాలు అంగీకరించవని బడుగు దేశాలపైనా ముఖ్యంగా విబంధ దేశాలపైనా అనేక విధాలుగా ఒత్తిడి తెస్తుంటాయని ఆయన అన్నారు.

కాని అల్జీర్సు మహాసభలో విబంధ దేశాల సంఘీభావం, సహకారం పెరిగిందని ఈ వాస్తవాన్ని అందరూ గుర్తించాలని టిటో అన్నారు.

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు తణుకులో సరస్వతీ మహిళామండలి భవనానికి ప్రారంభోత్సవం చేసిన దృశ్యం.

# రాష్ట్రపతి ఎన్నికపై కేంద్రం వాదానికి తమిళనాడు మద్దతు

న్యూఢిల్లీ, మే 21 : ప్రస్తుత రాష్ట్రపతి శ్రీ. వి వి. గిరి ఆగస్టులో పదవీ విరమణ చేసే లోగా రాష్ట్రపతి ఎన్నికల నిర్వహణకు, ఒక శాసనసభ లేక కొన్ని శాసన సభల రద్దు అవరోధం కారాదన్న కేంద్ర ప్రభుత్వం వైఖరిని తమిళనాడు ప్రభుత్వం పూర్తిగా సమర్థించింది.

తమిళనాడు అడ్వకేట్ జనరల్ శ్రీ ఎస్. గోవిందస్వామినాథన్ నిన్న సుప్రీం కోర్టులో వ్రాతమూలకమైన వాదనలను దాఖలుచేస్తూ, ప్రస్తుతం వున్న శాసన సభలకు ఎన్నిక కాబడిన సభ్యులుమాత్రమే రాష్ట్రపతి ఎన్నికకు వోటింగ్‌లో పాల్గొనవచ్చునని రాజ్యాంగ నిబంధనలు తెలుపుతున్నవని వాదించారు.

గుజరాత్ అసెంబ్లీ రద్దు అయినప్పటి కారణంగా రాష్ట్రపతి ఎన్నికలు వాయిదావేయాలా అన్న సమస్యపై సలహా ఇవ్వవలసిందిగా కేంద్రం చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకొని సుప్రీం కోర్టు ఈ విషయమై సోమవారం నుండి విచారణ ప్రారంభిస్తున్నది.

## ముఖ్యమంత్రితో ఆస్ట్రేలియా డిప్యూటీ కమిషనర్ సమావేశం

''ఆంధ్రపత్రిక'' ప్రతినిధి

హైదరాబాద్, మే 21 : ఆస్ట్రేలియా డిప్యూటీ హై కమీషనర్ శ్రీ డబ్ల్యు. జి. మిల్లర్ నిన్న ముఖ్యమంత్రిని బేగంపేటలోని వారి బసలో కలుసుకొని మాట్లాడారు.

## శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

హైదరాబాద్, మే 21 : ప్రభుత్వ పరిపాలనలో కొత్తగా ఏర్పాటుచేసే తెలుగు అభివృద్ధిశాఖ ప్రత్యేకాధికారిగ శ్రీ గుంటూరు శేషేంద్రశర్మను నియమిస్తున్నట్లు తెలుస్తోంది.

# జిల్లాల అభివృద్ధికి పరిశ్రమల ప్రారంభం: ముఖ్యమంత్రి వివరణ

ఆంధ్రపత్రిక ప్రతినిధి

మహబూబ్‌నగర్, మే 21: ప్రభుత్వం పరిశ్రమలు ప్రారంభిస్తుందని తద్వారా జిల్లాల అభివృద్ధికి తోడ్పడుతుందని ముఖ్యమంత్రి శ్రీ జలగంవెంగళరావు నాగర్‌కర్నూలు సభలో పేర్కొన్నారు.

నాగర్‌కర్నూలులో ప్రసూతి వార్డుకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు. ఈ భవన నిర్మాణానికి లక్ష రూపాయలు వ్యయం అవుతుంది. ప్రజలు రు. 75 వేలు విరాళం యివ్వగా, ముఖ్యమంత్రికి రు. 75 వేలు చెక్కును శ్రీ జాఫర్‌సేథి అందజేశారు. ప్రసూతివార్డుకు సిబ్బందిని పరికరాలను మంజూరు చెయ్యటానికి చేస్తారన్నారు.

హరిజనకాలనీల పూర్తి గావించడానికి అవసరమైన మొత్తాలను త్వరలో విడుదల చేస్తారన్నారు. అవసరమైన వారికి యిండ్ల స్థలాలు యిస్తారన్నారు.

ఎరువుల పంపిణీ సక్రమంగా జరుగడానికి రాష్ట్రస్థాయినుండి గ్రామస్థాయి వరకు సంఘాలు ఏర్పాటు చేశారు.

జూన్ 1 నుండి ప్రభుత్వ ఉత్తర్వులు అమలు జరుగుతాయన్నారు. ప్రభుత్వంతో సహకరించవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

రాష్ట్రంలో త్వరలో భూసంస్కరణలు అమలు జరుపుతారని చెప్పారు. ఈ సంవత్సరం మరి ఆరువేల మంది విద్యార్థులకు గ్రాంటు ప్రభుత్వం యివ్వదలచిందనిచెప్పారు. పరిషత్ అధ్యక్షుడు శ్రీ కె. కె.రెడ్డి అధ్యక్షత వహించారు.

శ్రీయుతులు పి. ఎస్. గౌడ్, పరసప్ప, అయ్యప్ప, జగన్నాథం ఎం. ఎల్. ఏ. లు, నరసిరెడ్డి, రామదేవరెడ్డి ఎం. ఎల్. ఏ. లు రంగిరెడ్డి, బాలస్వామిరెడ్డి, ప్రభాకరరెడ్డి ప్రసంగించారు. కలెక్టరు శ్రీ సయ్యద్ హైదర్‌రజా, డి. ఆర్. ఒ. శ్రీ టి. నాగరత్నం అధికారులు, అనధికారులు సమావేశానికి హాజరయారు. పది వేల మంది హాజరయారు. ముఖ్యమంత్రికి వేసిన పూలమాలను శ్రీ బి. పార్థసారథి వేలంలో ఆరువేలరూపాయలకు పాడారు.

120 మంది హరిజనులకు ఇళ్లస్థలాల పట్టాలను ముఖ్యమంత్రి పంపిణీ చేశారు.

## నూజివీడు తాలూకాలో బంజరుభూముల పంపిణీ

నూజివీడు, మే 21 : కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ ఇచ్చిన ప్రత్యేక ఉత్తర్వుల ననుసరించి 1—5—74 నుండి నూజివీడు తాలూకాలో యు. 17500 బంజరు భూమికి 128 నిరుపేదలకు పట్టాలు ఇచ్చారు. ఈ తాలూకాలో ఇప్పటివరకు మొత్తం యు 5256 ల భూమిని 3678 మంది భూమిలేని నిరుపేదలకు పట్టాలు ఇవ్వడం జరిగింది.

—:0:—

## ముఖ్యమంత్రి బెంగుళూరు పర్యటన

హైదరాబాద్, మే 21: ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు 22వ తేదీ ఉదయం విమానంలో బెంగుళూరు వెడతారు. 23, 24 అక్కడ ఉంటారు. 25 సాయంత్రం తిరిగివస్తారు.

## బస్సు ప్రమాదంలో విలేఖరులకు గాయాలు

వెల్లూరు, మే 21: పత్రికా విలేఖరుల బృందం ప్రయాణం చేస్తున్న మినీ బస్సు యిక్కడికి 20 కిలో మీటర్ల దూరంలో ప్రమాదానికి లోనైంది. బస్సు కంట్రోలు తప్పిపోయి వెల్లపురం దగ్గర హటాత్తుగా నిలిచి పోయింది. ఫలితంగా ఒక విలేఖరికి మోకాలి చిప్ప కీలు జారింది. మరొక విలేఖరికి తల పై గాయమైంది. తక్కిన వారికి స్వల్ప గాయాలయ్యాయి.

విలేఖరులు మొన్న జోలార్‌పేట నుండి తిరిగి వస్తుండగా యీ ప్రమాదం సంభవించింది.

—:0:—

## ఆంధ్రకేసరి వర్ధంతి

విజయవాడ, మే 21 : స్థానిక భగత్‌సింగ్ సేవాదళం ఆధ్వర్యాన ఈ రోజున ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులు 17వ వర్ధంతి సభ సేవాదళం కార్యాలయంలో జరిగినది.

సేవాదళం అధ్యక్షులు శ్రీ మాకల రామారావు అధ్యక్షతవహిస్తూ, ఆంధ్రకేసరి స్వర్గస్థులై పదిహేడు సంవత్సరాలైనా ఆంధ్ర ప్రజలు ఆయనను మరచిపోలేదని, అందుకు కారణం ప్రకాశంగారి నిరుపమ త్యాగశీలమేనని, నానాటికీ స్వార్థం పెరిగిపోతున్న ఈ రోజులలో ఆంధ్ర కేసరి వంటి త్యాగధనులను గుర్తుకు తెచ్చుకొని వారి అడుగుజాడలలో నడవడం యువతరం కర్తవ్యమని అన్నారు.

ఆంధ్రకేసరి జీవిత విశేషాలను వివరిస్తూ శ్రీయుతులు డి. కృష్ణమూర్తి, డి. రాజారావు, బి. సుబ్బారావు, ఎస్. వి. మల్లికార్జునరావు ప్రభృతులు ప్రసంగించారు.

సేవాదళం కార్యదర్శి శ్రీ తోటదుర్గారావు వందన సమర్పణ చేశారు.

## ముఖ్యమంత్రితో శ్రీ కొమ్మారెడ్డి సమాలోచన

''ఆంధ్రపత్రిక'' ప్రతినిధి

హైదరాబాద్, మే 21 : పార్లమెంటు సభ్యుడు శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ నిన్న ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావును కలుసుకున్నారు. ప్రధాన మంత్రికి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుల గూర్చి వ్రాసిన లేఖను తాము పత్రికలకు ఇవ్వలేదని ఆయనచెప్పారు.

తమను గూర్చి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు ఒకస్థానిక దినపత్రికలో ఏదో వ్రాయించిన సందువలనే తాము ప్రధానికి వారిని గూర్చి లేఖ వ్రాయవలసివచ్చిందని ఆయన చెప్పుకున్నట్లు తెలుస్తున్నది. ప్రధానమైన అధికార పదవులలో ఉండవలసినవారు ఎలాంటి వారు ఉండాలో వారి లక్షణాల గురించి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు జారీచేసిన ఒక ఉత్తరాన్ని బట్టి కూడా ఆ లక్షణాలన్ని ఎంతవరకు ఇక్కడ అన్వయిస్తున్నాయో పరిశీలించవలసిందిగ కూడా ఆయన తెలిపినట్లు తెలుస్తున్నది. తాము ఎలాంటి విచారణకయినా సిద్ధమేనని, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులపై తాము చేసిన ఆరోపణల బుజువు చేయగలమని చెప్పినట్లు తెలుస్తోంది.

తమపై ఎలాంటి విచారణజరిపినా సిద్ధమే నన్నారు. అలాగే ఎవరిమీద ఆరోపణలు ఉంటే విచారణకు వారు సిద్ధంగా ఉండాలని చెప్పినట్లు తెలుస్తున్నది. ప్రదేశ్ కాంగ్రెసు సంఘం తమను గూర్చిచేసిన తీర్మానంపై ఆయన కాంగ్రెసు అధ్యక్షులు డాక్టరు శంకర్ దయాల్ శర్మకు ఒక తంతిని యిచ్చారు.

ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు పశ్చిమ గోదావరి జిల్లాపరిషత్తు అధ్యక్షులు, పార్లమెంటు సభ్యులు శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ కేంద్ర మంత్రి శ్రీ కొత్త రఘురామయ్య, ముఖ్యమంత్రి సమక్షంలో కూర్చుని ఆంతరంగికమైన వ్యవహారాల గూర్చి మాట్లాడుకోవడం మంచిదని ఒక అభిప్రాయం వ్యక్తమయినట్లు తెలుస్తోంది.

నల్గొండ జిల్లాకు చెందిన కాంగ్రెసు నుంచి తాత్కాలికంగా తొలగింపబడినకాంగ్రెసు శాసన సభ్యుడు శ్రీ చక్కిలం శ్రీనివాసరావు వారి అనుయాయులు కూడా నిన్న సాయంత్రం ముఖ్యమంత్రిని కలుసుకున్నారు.

తమ జిల్లాలో మొన్న ఎన్నికలలో జరిగిన సంఘటనల గూర్చివారు ప్రస్తావించినట్లు కాంగ్రెసు శిక్షణను ఎప్పుడు కాపాడగలిగినట్లు వారు హామీ యిచ్చినట్లు తెలుస్తోంది.

# రైల్వే సమ్మె పరిష్కారానికై మరో యత్నం: డాంగే వెల్లడి

న్యూఢిల్లీ, మే 21 : ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి నిన్న సాయంత్రం శ్రీనగర్‌నుంచి ఢిల్లీకి తిరిగి రావడంతో, రైల్వే సమ్మె పరిష్కారానికి ప్రభుత్వం ఏదో ఒక విధంగా చొరవ తీసుకోగలదని రైల్వే ఉద్యోగుల జాతీయ సమన్వయ సంఘం నాయకులు ఆశిస్తున్నారు. సమ్మె ప్రారంభమై నేటికి 14 రోజులయింది. అనేక ఎక్స్‌ప్రెస్, పాసింజర్ రైళ్లను పునరుద్ధరిస్తున్నట్లు, పనివారి హాజరులో పరిస్థితి మెరుగయినట్లు రైల్వేశాఖ ప్రకటించింది.

సమ్మెను అణచివేయాలన్న ప్రభుత్వ ప్రయత్నం విఫలం అవుతున్నదనీ సమ్మె చేస్తున్న వారిపైన, వారి కుటుంబాలపైన దమననీతితో వ్యవహరిస్తున్నారనీ జాతీయ సమన్వయ సంఘం ప్రకటించింది. నేడు అణచివేత వ్యతిరేకదినంగా పాటించాలని ఈ సంఘం నిశ్చయించింది.

ఈ సమస్యకు ప్రధానినుంచి ఒక పరిష్కారాన్ని పొందడానికి ఐ. ఐ. టి. యు. సి., ఇతరులు మరో ప్రయత్నం చేస్తున్నట్లు కమ్యూనిస్టు పార్టీ నాయకుడు శ్రీ డాంగే నిన్న చెప్పారు. సమ్మె పరిష్కారానికి అనేక సూత్రాలను ప్రధానికి పంపడం జరిగింది. కాని సమ్మెను ఉపసంహరించాలని ఆమె సలహా ఇవ్వడం తప్ప మరేమీ సూచనప్రాయంగా నయినా తెలుపలేదని ఆయన చెప్పారు. ప్రస్తుత పరిస్థితిలో అది అమలు చేయడానికి సాధ్యం కాని షరతనీ, దీనితోపాటు ప్రభుత్వం కొన్ని హామీలు ఇవ్వనిదే దీనిని అమలు చేయడం కుదరదనీ శ్రీ డాంగే అన్నారు. ఈ విషయంపై తాము నేడు ప్రధానికి ఒక లేఖ వ్రాయనున్నామన్నారు.

స్థితి బాగా మెరుగయిందని రైల్వే ప్రతినిధి ఒకరు చెప్పారు. గత 24 గంటలలోను ఈ రైల్వే 65 గూడ్సు' 36 పాసింజరు రైళ్లు నడిపింది. ఇంతవరకు 618 మందిని అరెస్టు చేశారనీ, సుమారు 400 మంది ఉద్యోగులు బర్తరఫ్ అయ్యారనీ కూడా ఆయన చెప్పారు.

## ఉత్తర రైల్వే మినిస్టీరియల్ సిబ్బంది సమ్మె విరమణ

అఖిలభారత రైల్వే మినిస్టీరియల్ సిబ్బంది ఉత్తర రైల్వే విభాగంవారు సమ్మె నోటీసును ఉపసంహరించుకుంటూ రైల్వే ఉపమంత్రి శ్రీ ఖురేషికి లేఖ వ్రాశారని ప్రభుత్వం ప్రకటించింది. ప్రధాని, రైల్వే మంత్రి చేసిన విజ్ఞప్తిపై వారీ చర్య తీసుకుంటున్నారు. ఉత్తర రైల్వేలో సమ్మె ఉపసంహరించిన సంఘాలలో ఇది మూడవది.

## 2 వేల మంది ఉద్యోగుల చేరిక

గౌహతి : సమ్మె చేస్తున్న రెండు వేల వందికిపైగా ఉద్యోగులు పనులలో చేరడంతో, ఈశాన్యరైల్వేలో రైళ్లరాకపోకల పరి

—:0:—

## కాంగ్రెసు పటిష్ఠతకు కృషి చేయండి: శ్రీ వీరమాచనేని విజ్ఞప్తి

గన్నవరం, మే 21 : దుండగులను అదుపులో పెట్టడానికి ప్రజలు ఏమాత్రం జంకవలదని, నిన్న సాయంత్రం స్థానికబ్లాక్ కాంగ్రెస్ కార్యాలయ భవన ప్రారంభోత్సవ సభలో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ చెప్పారు.

కాంగ్రెస్ ఆశయాలను చెప్తూతూ, వ్యక్తిగత స్పర్ధలు లేకుండా కాంగ్రెస్ పటిష్ఠతకు కృషి చేయాలని కాంగ్రెస్ కార్యకర్తలకు విజ్ఞప్తి చేశారు.

శ్రీయుతులు ముసాలప్పారు వెంకటేశ్వరరావు, ఎం. ఎల్. ఎ. శ్రీమతి టి. ఇ. ఎస్. ఆనందబాయ్, డాక్టరు ఎల్. వెంకటేశ్వరరావు అంతా రామారావు, చింతపల్లి సుబ్బారావు, సర్పంచి జాస్తి వెంకటేశ్వరరావు ఇంకా వందలాది కార్యకర్తలు, పలువురు సర్పంచిలు పూరేగింపులో పి. సి. సి. అధ్యక్షులను కార్యాలయం వద్దకు తీసుకొచ్చారు.

శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ కార్యాలయానికి ప్రారంభోత్సవం జరిపి, కాంగ్రెస్ జండాను ప్రతిష్ఠించారు.

జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు సభకు అధ్యక్షత వహించారు. బ్లాక్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ముసాలప్పారు వెంకటేశ్వరరావు స్వాగతం చెప్పారు. ఎం. ఎల్. ఎ. ఆనందబాయ్ ప్రసంగించారు. బలిహీన వర్గాల తరపున శ్రీ కుంచేటి వీరరాఘవయ్య, ప్రత్తిపాటి ఆదినారాయణ విజ్ఞప్తి పత్రాలను సమర్పించారు. సర్పంచి శ్రీ జాస్తి వెంకటేశ్వరరావు వందన సమర్పణ చేశారు. స్వ.వి.

—:0:—

## పవర్‌పేట దగ్గర స్త్రీ మృతి

ఏలూరు, మే 21 : నిన్న మధ్యాహ్నం యిచ్చట పవర్‌పేట రైల్వేస్టేషన్ సమీపంలో గుర్తు తెలియని ఏడి వయస్కురాలు ఒక స్త్రీ విజయవాడ వైపుగా వస్తున్న గూడ్సు బండి క్రింద పడి మరణించింది. ఆమె రైల్వే లైను దాటుతుండగా ఈ ప్రమాదం జరిగినట్లు తెలుస్తోంది. రైల్వే పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు. స్వ.వి.

# అణచివేత వ్యతిరేక దినం

న్యూఢిల్లీ, మే 21 : రైల్వే పనివారి సమ్మెను ఉధృతం చేయాలని జాతీయ సమన్వయ సంఘంవారు నిశ్చయించారు. మే 21న సెంట్రల్ ట్రేడ్ యూనియన్‌లు అణచివేత వ్యతిరేక దినం పాటిస్తున్నాయి.

సమన్వయ సంఘ కార్యవర్గము రెండు గంటలు సమావేశం జరిపింది. సమ్మెను ఉపసంహరిస్తున్నట్లు ఏ సంఘం ప్రకటించినా దానిని ఖాతరు చేయరాదని పనివారికి విజ్ఞప్తి చేసింది. పరిగణనలోకి తీసుకోవద్దని కోరింది. సమ్మెను ఉపసంహరించే హక్కు ఏ సంఘానికి లేదన్నారు.

డివిజన్ స్థాయిలో పనిచేస్తున్న అధికారంలేని వ్యక్తులు కొద్ది ప్రకటనలు చేశారు. అలాంటి ప్రకటనలు చేయుటయేకాని రైల్వే అధికారులు వారిని వత్తిడి చేశారని కూడా కార్యవర్గమువారు అంటున్నారు. రైల్వే పనివారిని పెడ్రోవ పట్టించడానికి ఆ ప్రకటనలు పంపిణీ చేస్తున్నారన్నారు.

దేశంలో తూర్పు, పశ్చిమ ప్రాంతాలలో రైల్వే పనివారిపైన వారి కుటుంబాలవారిపైన పోలీసులు హింసాకాండ సాగిస్తున్నారని, గాలింపు జరుపుతున్నారని తమకు సమాచారం చేరుతున్నదని, చాలా సమన్వయ సంఘం కార్యవర్గం పేర్కొన్నది. చాలా రైల్వే కాలనీలలో భీబాహం నెలకొన్నదన్నారు.

అన్నివిధాల సమ్మెను ఉధృతం చేయడమే దీనికి పరిష్కార మార్గమన్నారు.

## అణుశక్తి పరీక్ష వివరాల మదింపు 6 నెలల వరకు సాధ్యంకాదు : సేత్నా వివరణ

బొంబాయి, మే 21 : గత సోమవారం నాడు భూగర్భంలో జరిగిన అణుశక్తి పరీక్ష జరిగిన చోటు వద్ద వివరాలను సేకరించి, దానిని మదింపు చేయడానికి కనీసం ఆరు నెలలు పట్టగలదని అణుశక్తి సంఘం అధ్యక్షుడు డాక్టర్ హెచ్. ఎన్. సేత్నా నిన్న పత్రికలవారితో చెప్పారు.

ఇలాంటి భూగర్భ అణుశక్తి పరీక్షలను అమెరికా, రష్యా కూడా నిర్వహిస్తున్నాయని ఆయన చెప్పారు. అమెరికా గ్యాస్ కోసము, రష్యా క్రూడ్ ఆయిల్ రంగంలో వినియోగం నిమిత్తం ఇలాంటి ప్రయోగాలు చేశాయనీ, అయితే ఇంతవరకు ఏ దేశమూ ఇలాంటి ప్రయోగాలు తవ్వకానికి, లోతు చేయడానికి, కాలువలను వెడల్పు చేయడానికి ఉపయోగించలేదనీ, దీనికి కారణం బహుశా రేడియో ధార్మిక శక్తిలని ఆయన అన్నారు. ఈ ప్రయోగాల తర్వాత, తరువాత అయిన గ్యాస్‌ను అమెరికా ఇంతవరకు వ్యాపారం కోసం విడుదల చేయలేదని, దీనికి కారణం రేడియో ధార్మిక శక్తి అని అన్నారు.

భారతదేశం తన విజ్ఞానాన్ని గ్యాస్, క్రూడ్ ఆయిలుల సాధనకు వినియోగించ దలచిందని, ఆయన మరోమారు స్పష్టం చేశారు.

—:0:—

బెంగుళూరు, మే 21 : బొంబాయి నుంచి బెంగుళూరుకు చేతి గడియారాలను దొంగతనంగా రవాణా చేసే బృందాన్ని మొత్తంగా కస్టమ్స్ సిబ్బంది పట్టుకోగలిగినట్లు ప్రకటన జరిగింది.

## శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ

### నోటిఫికేషన్

ఈ యూనివర్శిటీకి చెందిన యీ క్రింద వివరింపబడిన 1974 మే / జూన్ పరీక్షలు లోగడ ప్రకటింపబడిన తేదీలలో గాక, ప్రస్తుతము ఆయా పరీక్షలకు యెదురుగా గుర్తింపబడిన తేదీలలో జరుపబడునని యీ ప్రకటన ద్వారా తెలియజేయడమైనది.

| వ. నెంబరు | పరీక్ష యొక్క పేరు | ప్రారంభింపబడు తేదీ |
|---|---|---|
| 1. | మెట్రిక్యులేషన్, ప్రీ-యూనివర్శిటీ, మరియు వోరియంటల్ టైటిల్సు (ఎంట్రెన్సు పరీక్షతో సహా) బి.మ్యూజిక్ డిగ్రీ మరియు మ్యూజిక్ టైటిల్సు. | 10 జూన్ 1974 |
| 2. | పార్టు I — మొదటి ఏడాది బి.ఏ., బి.ఎస్‌సి., మరియు బి.కామ్. (రివైజుడ్ రెగ్యులేషన్సు) మరియు పార్టు I — రీ ఆర్గనైజుడ్ మూడు యేండ్ల బి.ఏ., బి.ఎస్‌సి., మరియు బి.కామ్., బి.ఎస్‌సి. (స్పెషల్) హోమ్ సైన్సు మరియు బి.ఏ., సంస్కృత శాస్త్రముల డిగ్రీ పరీక్షలు. | 10 జూన్ 1974 |
| 3. | పార్టు I—, రెండవ ఏడాది బి.ఏ.,బి.ఎస్‌సి., మరియు బి.కామ్. (రివైజుడ్ రెగ్యులేషన్స్) డిగ్రీ పరీక్షలు. | 12 జూన్ 1974 |
| 4. | పార్టు II — రీ ఆర్గనైజుడ్ మూడు యేండ్ల బి.ఏ., బి.ఎస్‌సి., మరియు బి.కామ్., బి.ఎస్‌సి., (స్పెషల్) హోమ్‌సైన్సు మరియు బి.ఏ., సంస్కృత శాస్త్రముల డిగ్రీ పరీక్షలు. | 21 జూన్ 1974 |
| 5. | పార్టు II — మూడు యేండ్ల బి.ఏ., బి.ఎస్‌సి., మరియు బి.కామ్., (రివైజుడ్ రెగ్యులేషన్సు) డిగ్రీ పరీక్షలు. | 24 జూన్ 1974 |
| 6. | పార్టు II—రెండవ ఏడాది బి.ఏ., బి.ఎస్‌సి., మరియు బి.కామ్ (రివైజుడ్ రెగ్యులేషన్సు) డిగ్రీ పరీక్షలు. | 28 జూన్ 1974 |
| 7. | పార్టు II—మొదటిఏడాది బి.ఏ., బి.ఎస్.సి., మరియు బి.కామ్ (రివైజుడ్ రెగ్యులేషన్సు) డిగ్రీ పరీక్షలు. | 1 జూలై 1974 |

పై పరీక్షలన్నింటికీ సంబంధించిన హాలు టిక్కెట్లు, టైమ్—టేబిల్సు, మరియు అభ్యర్థులకు సలహాలు గల కాపీలు, ఆ పరీక్ష కేంద్రములకు చెందిన చీఫ్ సూపరింటెండెంట్లకు పంపబడును. అభ్యర్థులందరు ఆయా పరీక్షలు ప్రారంభింపబడుటకు మూడు దినములు ముందుగా తమతమ హాల్ టిక్కెట్లు తీసికొనవలెను.

(ఆర్డరుతో)

యూనివర్శిటీఆఫీసు, తిరుపతి, తేది 16 మే 1974.

(సం) ఎం. కే. రామకృష్ణన్,
రిజిస్ట్రారు.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

### ప్రజా పనుల శాఖ (ప్రాజెక్టుల విభాగము)

### శ్రీశైలం హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు

మెకానికల్ సర్కిల్, శ్రీశైలం డామ్ ఈస్ట్‌పోస్టు, కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్

### టెండరు నోటీసు నెం. DM4/TP/1/74-75

ఈ క్రింద తెలియపర్చిన రవాణా పనులకు సీలు వేసిన టెండర్లను సూపరింటెండింగ్ ఇంజనీర్, మెకానికల్ సర్కిల్, శ్రీశైలం ప్రాజెక్టు, శ్రీశైలం డామ్ ఈస్టుపోస్టు 518102 కర్నూలు జిల్లా ఆంధ్రప్రదేశ్ వారిచే శ్రీశైలం ప్రాజెక్టులో తన కార్యాలయంలో 5.6.74 మ. 3 గంటలవరకు స్వీకరించబడును. టెండర్లు అదే రోజు సా. 4 గంటలకు సూపరింటెండింగ్ ఇంజనీర్, మెకానికల్‌సర్కిల్, శ్రీశైలం ప్రాజెక్టు వారిచే హాజరైన టెండరర్లు లేక వారి అనుమతి పొంది ఆ సమయమునకు హాజరైన ప్రతినిధుల సమక్షంలో తెరువబడును.

| వివరములు | | సరఫరా కాలపరిమితి | ధరావతు | అమ్మకంపన్నుతో కాంట్రాక్టు చేర్చి టెండరు దాకుమెంట్లు ఖరీదు | విధానము |
|---|---|---|---|---|---|
| [illegible] | | 7 | రు. | రు. పై. | |
| | | | 85850 | 20.80 | |

టెండరు దాకుమెంట్లు [illegible] 28.5.1974. [illegible] 25.5.1974 నుండి 31.5.1974వరకు పొందవచ్చును. [illegible]

గమనిక: (1) టెండర్లను కనీసము 32 రవాణా వాహనములకుస్వంతదార్లయినవారి నుండి మరియు మొదటి తరగతి రిజిస్టర్డు పబ్లిక్‌వర్క్సు డిపార్టుమెంటు సివిల్‌కంట్రాక్టర్ల నుండి లేక ప్రఖ్యాతి చెందిన కంట్రాక్టర్లనుండి మాత్రమే స్వీకరించెదరు. టెండరు షెడ్యూలు జారీచేయుటకు గాను ఈ విషయంలో తగిన ఋజువులు దాఖలు పర్చవలెను.

గమనిక: (2) చీఫ్ ఇంజనీర్ (ప్రాజెక్టు) శ్రీశైలం ప్రాజెక్టు, హైదరాబాద్ వారి వద్ద రు. 50,000 లు శాశ్వత డిపాజిటు చెల్లించి యుండి నిర్ణీత ఫారములో బాండు వ్రాసి యుండిన కంట్రాక్టర్లు, తమ టెండర్లతో బాటు ధరావతు రు. 57225 లు చెల్లించుటకు అనుమతించబడినది.

గమనిక: (3) విజయము పొందిన టెండరరు, చీఫ్ ఇంజనీర్ (ప్రాజెక్ట్సు), శ్రీశైలం ప్రాజెక్టు, హైదరాబాద్ వారివద్ద 50000 శాశ్వత డిపాజిట్టు చెల్లించియుండని పక్షంలో తదుపరి డిపాజిట్టు క్రింద రు. 57225లను బ్యాంకు గ్యారంటి రూపములో రు. 22.50 పైసల స్టాంపు పేపరులో చెల్లించవలెను. రిజర్వు బ్యాంకు చే గుర్తింపబడిన ఏదేని షెడ్యూలు బ్యాంకు నుండి ఈ బ్యాంకు గ్యారంటీని పొందవలెను. బ్యాంకు గ్యారంటీని అకౌంట్సు ఆఫీసర్, శ్రీశైలం ప్రాజెక్టు వారి పేర్న తీసుకొనవలెను.

(సం.) బి. కోటయ్య,
సూపరింటెండింగ్ ఇంజనీర్,
మెకానికల్ సర్కిల్, శ్రీ శైలం ప్రాజెక్టు

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.

## వేలం ప్రకటన

విజయవాడ సబ్‌కోర్టు ఫయిలు IP No. 50/52, IP 5/53 అఫిషియలు రిసీవరు గారి ఫయిలు IP No.'s 29 + 30/54 పిటీషనులలో యిన్సాల్వెంట్లుఅయిన కోంటి వెంకటరత్నం వగైరాల తాలూకు ఆస్తులను 22—6—1974తేదీ ను.12గంటలనుండి మచిలీపట్టణం కృష్ణాజిల్లా అఫీషియల్ రిసీవరు గారిఆఫీసులో బహిరంగముగావేలంవేయబడును.

The sale is of the right title and interest of the insolvents subject to all risks; burdens and litigations and also subject to the Mortgage decree in O S. 21/67 in favour of K. V. Raghavendra Rao (1 to 6 Items) and also subject to the tenancy rights of the tenants in occupation of the buildings.

వేలంవేయు ఆస్తుల పూర్తి వివరములు వేలం షరతులుఇతరవివరములు మచిలీపట్టణం, కృష్ణాజిల్లా అఫిషియల్ రిసీవరుగారి ఆఫీసులో తేది 20—5—74నుండి తెలిసికొనవచ్చును.

వేలంవేయు ఆస్తుల సంగ్రహము

— విజయవాడ ఆస్తులు —

1. కాన్‌వెంటు వీధిలో ఉన్న పెంకుటిల్లు కొట్లు,సుమారు 1300చ.గ.స్థలం.
2. రాంగేటు ఆఫీసురోడ్డులో ఉన్న "రావు మహల్" మేడ—సుమారు— 583 చ. గ. స్థలం.
3. సత్యనారాయణపురంలోఉన్న కాళీస్థలం సుమారు 1073 చ.గ.
4. గోవిందరాజులుపేటలో ఉన్న కాళీస్థలం సుమారు—1588 చ.గ.

— మచిలీపట్టణం ఆస్తి —

5. రాబర్ట్సన్‌పేటలో ఉన్న డాబా728 చ.గ. స్థలం.

— మద్రాసు —

6. మద్రాసు—అడయారు గాంధినగరంలో ఉన్న ఆస్తి సుమారు 105 చ. గ. కాళీస్థలం.
7. రామానుజపట్టణం—దిల్లి యు. 3—15 in R. S. No. 169—15

ఎం. కుటుంబరావు, అడ్వకేట్,
మచిలీపట్టణం 1—5—1974 } అఫిషియల్ రిసీవర్, కృష్ణా,మచిలీపట్టణం-3

## పౌర విమాన శాఖ

[illegible]

టెండర్లు 5.6.1974 తేదీ మ. 3 గంటలకు కంట్రోలర్ ఆఫ్ ఏరోడ్రోమ్స్‌వారి ఆఫీసు, మద్రాస్ రీజియన్, మద్రాసునందు హాజరైన టెండరర్ల సమక్షంలో తెరువబడును.

davp. 621 (15) 74

NB: దరఖాస్తు కాపీలు ఆంధ్ర యూనివర్సిటీ రిజిస్ట్రారుకు పంపవలెను.

ఎం. లీలావతమ్మ. కరస్పాండెంటు.

Hindustan Machine Craft, 286 Linghi Chetty Street, Madras-1 Coimbatore & Bangalore.